శ్రీరస్తు

# శ్రీ హనుమత్ ప్రబంధము

మూడవ భాగము – వచనము

(హనుమంతుని మహిమను దెలుపు కథలు, గాథలు, ఆంజనేయ దండకము, తులసీదాసు హనుమచ్చాలీసా తెలుగు అనువాదముతో సహా ఇందు కలవు)


రచయిత

'కవిశేఖర', 'భారతీ ప్రసన్న' 'అభినవ పోతన'

కొండేపూడి సుబ్బారావు



* * *

శ్రీశ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు, ధార్మిక గ్రంథ ముద్రణ ప్రణాళిక క్రింద నొసగిన ద్రవ్య సహాయమున ఈ గ్రంథము ముద్రింప బడినది.

* * *

ప్రసన్న భారతీ గ్రంథమాల

**47-10-5,** ద్వారకానగరము, విశాఖపట్టణము - **530 016**

ఆంధ్రప్రదేశ్, ఇండియా

ప్రచురణ - వృష ఆశ్వయుజ శు.౧౦. విజయదశమి
అక్టోబరు - 2001



వెల రు. 30-00 **U.S. $ 6**

**ప్రాప్తిస్థానము :** గ్రంథకర్తకు వ్రాయవలెను
47-10-5, ద్వారకానగరము
విశాఖపట్టణము - 530 016
ఆంధ్రప్రదేశ్, ఇండియా.

**ముద్రణ :**
D.T.P ప్రసన్న భారతి గ్రాఫిక్సు

ఆఫ్‌సెట్ ప్రింటింగు,
శక్తిప్రింటర్సు దొండపర్తి, విశాఖపట్టణము.

# హనుమత్ప్రబంధము - మూడవ భాగము

## తొలిపలుకు

హనుమత్ప్రబంధము అను హనుమచ్చరిత సర్వస్వమున ఇది మూడవ భాగము వచనము. మొదటి రెండు భాగములును పద్యకావ్యములు. ఆంజనేయుని జననము మొదలు శ్రీరామ పట్టాభిషేకము వరకు గల కథ - ఈ మూడవ భాగమందు హనుమంతుని మహిమను దెలుపు కథలు గాథలు కలవు.

కృతయుగమున దుష్టరాక్షస సంహారమున కవతరించిన శ్రీ విష్ణువు శ్రీరామునకు సర్వవిధముల తోడ్పై ప్రధాన పాత్ర వహించిన పారమేశ్వర శక్తి సంపన్నుడు శ్రీ హనుమంతుడు. భవిష్యద్బ్రహ్మ కాగలిగిన చిరజీవి, నేటికిని గంధ మాదన పర్వతమున తపశ్శాలియై, భక్తజనుల బాధలు నశింప జేసి, ఇహపర సౌఖ్య సంపదలు భక్తుల కొసగు చున్న కరుణాళుడు.

హనుమంతుడు యావద్భారత ప్రజారాధ్యుడు. అత్యంత ప్రజాదరణ పొందిన దైవమూర్తి. ప్రతిగ్రామమున ప్రతిపట్టణమందు ఏ కూడలి యందో, అభయ హస్తము గదాయుధము కలిగిన మహోన్నత హనుమద్విగ్రహము దర్శన మిచ్చుచునే ఉండును. ప్రజల మధ్య ఇంతటి మహా ప్రసిద్ధి నందుట హనుమంతునకే చెల్లినది. గ్రంథ ప్రస్తావన యందు ఈ విషయములన్నియు వివరింప బడినవి.

## కృతజ్ఞత

1. ఈ పుస్తక ముద్రణకు ద్రవ్య సహాయమొసంగిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి

2. ఈ పుస్తకమునకు ముఖచిత్ర చిత్రము వ్రాసి పంపిన శ్రీ 'బాపూ' గారికి,

3. నా విన్నపమును మన్నించి ఈ పుస్తకమునకు హనుమద్దర్శనము అను పేర ఆంజనేయ తత్త్వమును గూర్చి భూమిక వ్రాసి యిచ్చిన మహా పండితులు, వ్యాకరణాలంకార చక్రవర్తి, ఆచార్య శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మగారికి.

4. ఈ హనుమత్ప్రబంధ రచనమున అటనట నాకు గల సందేహముల దీర్చి సాధు వాదమును తెలిపిన కవి పండితులకును

నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

భక్తి తత్పరు లెల్లరు ఈ గ్రంథమును చదివి, హనుమత్కృపా విశేషమునకు పాత్రులగుదురుగాక.

# శ్రీ హనుమత్ప్రబంధము

మూడవ భాగము - విషయ సూచిక

హనుమంతుని మహిమను దెలుపు కథలు, గాథలు

ముఖ పత్ర చిత్రము శ్రీ 'బాపూ'

శ్రీ రామాయనమః

# శ్రీ హనుమత్ప్రబంధము

## మూడవ భాగము

## ఇష్టదేవతా ప్రార్థన

### విఘ్నేశ్వర స్తుతి

విలసితసత్కృపాన్వితుడు విఘ్నములన్ దొలగించుదైవ ము
జ్జ్వల శశివర్ణసుందరుడు భక్తులొసంగెడి పూజనాదులం
దొలుతగ గూర్మిగైకొను చతుర్భుజు డార్యకు ముద్దుబిడ్డడై
యలరిన గుజ్జువేలుపు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికై.

### త్రిమూర్తిస్తుతి

చెలువొప్పన్ బదునాల్గులోకములు సృష్టింజేసి పోషించి త
ద్విలయావృత్తి పునఃపునఃక్రమము దీపింపంగ జేయన్ సమ
ర్థులు బ్రహ్మాచ్యుతఫాలనేత్రులు త్రిమూర్తుల్ వారి కారుణ్యసం
కలితప్రాభవ సంపదున్నతులకై గావింతు సంస్తోత్రముల్.

### వాణీ లక్ష్మీ పార్వతీస్తుతి

నిరతోద్యత్కరుణా విలాస విభవోన్నిద్రైక వీక్షావిని
ర్భర వాత్సల్యము జూపి భక్తులకు విద్యద్భాగ్యదీవ్యత్ శుభో
త్కరముల్ గల్గగ జేయు ప్రేమభరితాత్మల్ భారతీ శ్రీ శివల్
సరవిన్ నన్గృపజూచుతున్ మధురవాత్సల్యానురాగమ్ములన్.

# హనుమంత్ స్తుతి

అంజనానందనం వీరం జానకీశోక నాశనమ్!
కపీశమక్ష హన్తారం వందేలంకాభయంకరమ్!!

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసామ్
రామాయణ మహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్॥
వాతాత్మజం వనరయూథముఖ్యం
శ్రీ రామదూతం శిరసానమామి॥
ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహమ్॥
పారిజాత తరుమూల వాసినం
భావయామి పవమాన నందనమ్॥

శ్రీ రామప్రభు దివ్య నామజపసంసిద్ధి ప్రదానంద రే
ఖారోచిష్ణు! డజేయ విక్రమ మహోగ్ర స్థైర్యుడున్ సాధుగా
థారమ్యుండు శివాంశ సంజ్యనితుడున్ త్రయ్యర్థ విద్యావిదుం
డారాధ్యుండగు నంజనాతనయు డత్యంతమ్ము నన్నోముతన్.

# హనుమద్దర్శనము

వ్యాకరణాలంకార చక్రవర్తి - ఆచార్య అప్పల్ల సోమేశ్వర శర్మ

ప్రవేశిక : ''కవిశేఖర'' శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు, తమ మహాకావ్యం ''హనుమత్ప్రబంధము''ను గురించి ''తాత్త్వికంగా కొన్ని మాటలను వ్రాయండ''ని సహృదయ సంభావనతో నన్ను కోరినారు. వారి మాటకు కాదన లేదు. కాదనలేను. మా ఉభయులకుండే రసార్ద్ర హృదయ బంధమది. అంగీకరించేను. పర్యవసానమే ఈ దిగువ పొందుపరచిన వాక్య కదంబం. ఈ అవకాశం వారు నాకిచ్చినారు. సంతోషం.

కవి : శ్రీ కొండేపూడి సుబ్బారావు మహోదయులు లోకజ్ఞానం కలిగిన నాటినుండి శ్రీరామ పరమ భక్తులు. శ్రీరామ దూత సేవా ధురంధరులు. పసితనం లోనే మాతృదేవత నుండి పోతనగారి భాగవతామృతాన్ని స్తన్యంతో పాటు గ్రోలిన వారు. ఇదీ బాల్య సంస్కారం, పిదప ఆంగ్లవిద్య తత్రాపి ఎకౌంట్స్ అందువల్ల వృత్తి ప్రభుత్వంలో పెద్ద ''ఎకౌంట్స్ ఆఫీసర్''గా పరిణమించింది. అయినా ''సహజ సంస్కారం'' విడిచిపెడుతుందా! రామ హనుమద్భక్తి వ్యర్థమవుతుందా? సంస్కార బీజం మొలకెత్తింది. మొక్క అయింది. అచిర కాలంలోనే భారతీ దేవి కూడా ''ప్రసన్న''గా మారింది. ఇక కొదవ ఏమి? ఆ మొక్కయే నేడు మధుర కవిత్వమహా వృక్షంగా విజృంభించి శాఖోప శాఖలుగా విస్తరించి, సుగంధ పుష్పాలను, అమృత రస బంధుర ఫలాలను సహృదయ లోకానికి అందిస్తున్నది. నడి వయసులో జన్మించిన వీరి కవితా బాల క్రమంగా ముగ్ధ అయి, యువతి అయి, ప్రౌఢ అయి - నేడు తొమ్మిదవ పదిలో ఉన్న వీరిని ఆనంద సందోహంలో ముంచెత్తుతున్నది. భావుకులను పరవశింప జేస్తున్నది. ఇంచుమించు ''సర్వేశ్వర శతకము''తో ప్రారంభమై నేటి ''హనుమత్ప్రబంధము'' వరకున్ను ఉపశతంగా ఎన్నో హంగులతో ఉవ్విళ్ళూరిస్తున్నది.

శ్రీ సుబ్బారావుగారి కవిత్వానికి ప్రాచీనతే ప్రాణం. సంప్రదాయ బద్ధత మహా ప్రాణం. ఈ బలంతోనే వీరు ఎన్నో విధాలయిన ప్రక్రియలను పుష్కలంగా పండించినారు. విశేషించి ''పద్య రచన''యే వీరి మహావ్రతం! అది కూడా అనవద్యము, హృద్యము అయి ఉండాలి. కాగా వీరి కవితా కౌశలం ''కవిశేఖర -

కవిభూషణ - మధురకవి - అభినవ పోతన - భారతీ ప్రసన్న'' ''ఆంధ్రదండి'' మొదలైన నైక విధములైన బిరుదములన్నింటిలోను ''అభినవ పోతన'' అన్నది వీరికి మిక్కిలి అభిమతం - సార్థకం కూడా! ఒకనాడు మహాసభలో దీన్ని నేను నా అనుభవ పురస్సరంగా ప్రతిపాదించగా, సభ్యులందరున్ను ఏకకంఠంతో ఆమోదించినది కావడం ఇక్కడి ప్రత్యేకత. నాకు ''ఆత్మానందం''! అస్తు.

ఇంతకు ఆశ్చర్యం ఏమంటే - వృత్తి రీత్యా డిఫెన్సు అక్కౌంట్సు డిపార్టు మెంటులో ఎక్కువ కాలం ఇతర రాష్ట్రాలలో ఉండుట వల్ల సంస్కృత ఆంధ్ర భాషా సాహిత్యాలలో క్రమమైన శాస్త్రాధ్యయనం చేయడానికి అవకాశం లభించలేదు అనిన ఈ విషయం వీరు చెప్పినదే! అయినా సకల తత్త్వమయంగాను, సరసంగాను, సహృదయ హృదయ రంజకంగాను ఆంధ్ర కవితామతల్లి వీరిని వరించిందంటే అది కేవలం ''భారతీ ప్రసాదమే'' అని నొక్కినొక్కి చెప్పవచ్చు. ఆలంకారిక శిఖామణులందరు ''శిగపట్లు'' పట్టి చివరకు ''ప్రతిభ మాత్రమే కవిత్వానికి కారణం'' అని చప్పరించి ఊరుకున్నారు. ప్రతిభ అనగా ''భారతీ ప్రసాదమే''! దీన్ని పొందగలిగిన వారు ప్రాయశః తక్కువ మందే ఉంటారు. వారిలో ఈ కవి చేరడం మహాదృష్టం!

**కావ్యము :** ప్రస్తుతమైన కావ్యం ''హనుమత్ ప్రబంధము''. ఇది మూడు భాగాలుగా విస్తరించి ఉంది. మొదటి భాగంలో వివిధ ఛ్ఛందో బద్ధంగా 736 పద్యాలున్నవి. హనుమంతుని పుట్టుక మొదలు సాగర తరణానికి ప్రయత్నించు వరకున్ను కథ నడిచింది. రెండవ భాగమున 565 పద్దెములు. అంజనాసుతుని సముద్ర లంఘనం మొదలు శ్రీరామ పట్టాభిషేకము అయ్యేవరకు కథ వర్ణితము. ఈ మూడవ భాగం కేవలం గద్యమయం. ఇంచుమించు ఇరవై అయిదు ఖండికలలో మారుతి యొక్క స్వరూప స్వభావాలు, మహిమలు, కథలు, గాథలున్ను. అనేక పురాణ సంహితాదుల ప్రమాణాలతో వెల్లి విరిసేయి.

ఇక్కడ ఒక అంశాన్ని ప్రస్తావించాలి. ఈ కవియొక్క రచనలన్నీ - బహువిధ ప్రక్రియలతో పద్యమయములే. సంస్కృతంలోని మహా మహా ప్రబంధాలనే ద్విపద మయంగాను, ఇతరములను హృద్యపద్యమయంగాను తీర్చిదిద్ది, ఆంధ్ర వాణీ రామణీయకాన్ని ధగధగ లాడించిన దిట్టకవి ఈయన. ''గద్యం కవీనాం నికషం

పదింతే'' (గద్యరచన కవిత్వానికి గీటురాయి = పెద్ద పరీక్ష) అని సంస్కృతంలో ఒక సూక్తి ఉంది. దీనికి కూడా లక్ష్యం కావాలని కాబోలు - శ్రీ సుబ్బారావు గారు ఈ భాగాన్ని గద్యమయం చేసేరు. ఇందులోని ప్రకరణాలన్నీ మృదు మధురమైన పద బంధాలతోను, నుడికారాల తోను, నిండుగా మెండుగా ఉన్నాయి. సామాన్య సంస్కారి అయిన చదువరిని కూడా ఇట్టే ఆకర్షించి బుట్టలో వేసుకునే శక్తి దీటికుంది. గద్యరచనలో కూడా కవి 'సెబాస్'' అనిపించుకున్నారు.

ఈ తీరులో ''హనుమత్ప్రబంధము'' ముద్దుగా మూడు విభాగాలతో - ''ప్రస్థాన త్రయము'' వలెను, ''త్రిపథగ'' (గంగ) వలెను, ''త్రివేణీ సంగమం'' వలెను, ''మూర్తి త్రయము'' వలెను, ''మంత్ర త్రయము'' వలెను, ''అగ్నిత్రయము'' వలెను హనుమానుని దివ్యచరితమును భవ్యంగా వర్ణించి చదువు వారికి పరమ పవిత్రతను చేకూర్చి పెట్టింది. ప్రభాదివ్య కాయుడైన వాతాత్మజుని స్తుతించు అష్టోత్తర శతకములు, సహస్రనామములు, ఇతర స్తోత్రములు, కథాంతరములు, గ్రంథాంతరములున్ను విడివిడిగా కొల్లలుగా ఉండవచ్చు - ఉన్నాయి కూడా. **కాని వానరయూథ ముఖ్యుని సాకల్యంగా మనః ఫలకంపై చిత్రించగల రచనలు అల్పాల్పంగానే ఉంటాయి. అసలు ఉన్నాయా? అని సంశయం! అటువంటి సంశయాన్ని పోగొట్టి ''ఇదిగో నేనున్నాను. నేనే హనుమను'' అని జబ్బచరచి నిలబడుతుంది ఈ ప్రబంధం. సర్వాంగ సుందరంగాను, సర్వమనోహరంగాను, సర్వమయంగాను, సర్వ తారకంగాను, కాంచనాద్రి కమనీయ విగ్రహుడైన కపిముఖ్యుని ప్రతిష్ఠించింది ఈ కావ్యం.** అందువల్ల ఇది ''హనుమత్ప్రబంధము'' మాత్రమే కాదు. ''హనుమచ్చరిత సర్వస్వము'', ''ఆంజనేయాయనము'' అని నేను అనదలచుకున్నాను. ( ఈ భావాలు శీర్షికలోనే ఇమిడి ఉన్నాయనుకోండి. నేను వాటిని వాచ్యం చేయడానికి సరదాపడినాను.)

మరి అసలు విషయానికి రావలసి ఉంది. ''హనుమంతుని తత్త్వమేమి?'' అన్నదే అసలు విషయం. ఇక్కడ ఎన్నో అన్వయాలు, సమన్వయాలు, వ్యాఖ్యలు, ఉపవ్యాఖ్యలు, విమర్శలు పరిశోధనలున్ను విశాలంగా జరిగే ఉన్నాయి. అన్నింటినీ కలబోసి, కలగూర గంపను సద్ది, తాత్త్వికుల కందించడానికి యథాశక్తి ప్రయత్నం

చేస్తాను. ముఖ్యంగా నాలుగైదు ద్వారాలలో హనుమత్తత్త్వాన్ని దర్శించడం సముచితమని నా తత్పర్యం.

**ప్రపథమంగా శ్రీమద్రామాయణ ద్వారము :** ఇది లోకసిద్ధం - అతి ప్రసిద్ధం బహుక్షుణ్ణం అయిన మహాద్వారం కనుక కొన్ని అంశాలను గుర్తు చేసుకుంటే సరిపోతుంది. శ్రీ రామాంజనేయ భాగవతులకు అంతా ఇట్టే అర్థమవుతుంది.

1. ఋశ్యమూక పర్వతంపై మొట్టమొదట సారిగా హనుమంతుడు శ్రీరామ లక్ష్మణులను కలిసాడు. తొలి చూపులతోనే వారికి పరస్పరం స్పృహణీయమ్మైన అంతరనుభవం కలిగింది. ''దేవలోకం నుంచి దిగిన మహానుభావులు'' అనుకున్నాడు అంజనాసుతుడు. ఓహో! ఎంత చక్కగా మాట్లాడేడు. వేదాలన్నింటిని, సమగ్రవ్యాకరణాన్ని అధ్యయనం చేసినవాడే ఇతడు'' అనుకున్నాడు శ్రీరాముడు. ఇక్కడే కపివరుని దాసభావానికి, శ్రీరాముని భక్త జన సులభ భావానికిన్ని బీజం పడింది.

**2. తరువాత సముద్ర లంఘన సమయం :** చతికిలబడి కూర్చున్న పవన తనయుని జాంబవంతుడు ''బలం బుద్ధిశ్చ తేజశ్చ'' ఇత్యాది వచనాలతో ప్రోత్సహించి ''ఉత్తిష్ఠ హరి శార్దూల! లంఘయస్వ మహార్ణవమ్'' (లేవోయ్! నీవు కడు సమర్ధుడవు, సముద్రం దాటు) అని ఉత్తేజ పరచి ఉరకలు వేయించేడు.

3. ఇక ''సుందర కాండము'' అంతా సుందరుని వైభవమే గదా! సుందరుడనగా కపి సుందరుడే! లంకలో ప్రవేశించి నానాభీభత్సం సృష్టించి, సీతమ్మను చూచి, లంకను కాల్చి, ''దాసోహమ్ కోసలేంద్రస్య'' - ''దూత్యోహం రామచంద్రస్య'' అని అనుకుంటూ, వాయు వేగాన వచ్చి, శ్రీరామ చంద్రునికి సీతాకుశల వార్తని అందించేడు మారుతి. శ్రీరాముడు ఉవ్వెత్తున పొంగి పోయి ''ప్రియతమా! నీ సాహ్యాంలోకోత్తరం. దానివల్ల నేను, లక్ష్మణుడే కాక మా వంశమంతా రక్షింపబడింది. నేను నీకేమి ఈయగలను? గాఢాలింగనం మాత్రం ప్రేమ సారంగా ఇస్తాను. స్వీకరించు అని వానర యూథ ముఖ్యుని కౌగిలించుకున్నాడు. ప్రభుసేవకుల సౌహార్దానికిది పరాకాష్ఠ. భక్తునికి పరమానందం!

**4. శ్రీరామ పట్టాభిషేకము :** మారుతి ప్రభుసేవకు, సీతామతల్లి కృతజ్ఞతకున్ను కూడా ఇదే పట్టాభిషేకం. ఈ సంనివేశంలో ఇంద్రుడు కానుకగా

పంపిన మణిహారాన్ని శ్రీరాముడు సీతమ్మకివ్వడం జరిగింది. వెంటనే ఆ హారాన్ని

శ్లో॥ తేజో ధృతిః, యశోదాక్ష్యం సామర్థ్యం వినయో నయః
పౌరుషం విక్రమో, బుద్ధిః యస్మిన్ ఏతాని నిత్యదా

(తేజస్సు, ధైర్యం, కీర్తి, నైపుణ్యం, శక్తి, వినయం, రాజనీతి, పౌరుషం, పరాక్రమం, బుద్ధి అనే గుణాలు ఎల్లప్పుడు కలిగి ఉన్నవాడు) అని సంభావించి హనుమ మెడలో అలంకరించింది. ఇది చాలు హనుమ వైభవానికి!

కాగా - శ్రీరాముడు నరోత్తముడు - హనుమంతుడు వానరోత్తముడు. శ్రీరాముడు ప్రభువు. హనుమంతుడు నమ్మిన బంటు. శ్రీరాముడు దివ్య విభూతి! హనుమంతుడు దివ్యానుభూతి!

శ్రీవైష్ణవ సంప్రదాయంలో శ్రీరాముడు పరమాత్మ సీతమ్మ జీవాత్మ. వారిద్దరిని కలిపిన ఆచార్యవర్యుడే హనుమంతుడు. ఈ విధంగా రామాయణ ద్వారం నుండి హనుమంతుడు కనిపిస్తాడు.

**2. రెండవది పురాణ ద్వారం :** ముఖ్యంగా శివ పురాణం ఇది ''శివచరిత మహాసాగరం'' ఇందులో ఆంజనేయుని ప్రసక్తి విపులంగా ఉంది. పరమ శివుడు ఆయా సమయాలలో ఎన్నో అవతారాలు ధరించేడని, వానిలో ''హనుమ దవతారము'' ఒకటనిన్ని ఇది వర్ణించింది. చివరకు ''శివోఽద్వైతః'' అని సూత్రీకరించి, ప్రభువైన రాముడున్ను, బంటు అయిన ఆంజనేయుడున్ను ఒకటే తత్త్వమని వ్యాఖ్యానాన్ని బలపరిచింది.

ఇదీగాక హనుమత్ స్తోత్రాలలో

1. త్రినేత్రం కుండలోజ్జ్వలమ్ .............
2. మూర్తి త్రయాత్మాకం పీనం మహావీరమ్ ................
3. సుందరం సాబ్జనయనం త్రినేత్రమ్ .............
4. త్రిమూర్త్యాత్మక మాత్మస్థమ్

**మొదలైన వచనాలలో పావని త్రినేత్రుడని విశదంగా ఉంది. కనుక అతడు శివాంశ సంజాతుడే లేక శివావతారమే! ఇట్లు పురాణ ద్వారం మారుతిని పరమ శివునిగా చూపిస్తుంది.**

**3. సంహితాద్వారం :** వేదముల తాత్పర్యాన్ని విస్తరించడానికి అవతరించిన గ్రంథాలు ఇతిహాస, పురాణాలు. సంహితలు కూడా పురాణాల వంటివే. కొన్ని కొన్ని విశేషాంశాలను ఇవి విరివిగా వర్ణిస్తాయి. వీనిలో ఉమా సంహిత, పరాశర సంహిత అనే గ్రంథాల్లో కపివరుని వైభవమంతా తీర్చిదిద్దబడింది. అందులోను పరాశర సంహితలో హనుమంతుని విశ్వరూపం వేయి విధాలుగా ప్రదర్శించ బడింది. ప్రకృతమైన కృతిలో (మూడవ భాగంలో) కవిగారు కమనీయంగా వ్రాసినదంతా పరాశర సంహితనుండి సంగ్రహించినదే. అందువల్ల సంహితాద్వారం నుండి చూస్తే "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" అన్న విధంగా వానర ముఖ్యుడు కనిపిస్తాడు.

**4. మంత్ర ద్వారం :** ఇది అగాధం - అనంతం. ఓంకారం నుండే "సప్తకోటి" మహామంత్రాలు ఆవిర్భవించేయని సంప్రదాయం. ఇది వేద విరుద్ధమని కొందరంటారు. వైదికమే అని మరికొందరు. ఏదైనా బహుప్రచారాన్ని పొందిందిది. దేవారాధనలో ఇది విచిత్రమైన, విశిష్టమైన, వివిధమైన ప్రక్రియ. బీజాక్షరాలు, మంత్రం, తంత్రం, యంత్రం, ముద్ర, చక్రం మొదలైనవి ఇందులోని ప్రధానాంశాలు. వీటి వ్యాఖ్యానం ఇక్కడ అనవసరము. వేద పురాణేతిహాసాలలో పేర్కొనబడిన ప్రతి దేవునకు, దేవతకున్ను ఈ విధానం సుప్రతిష్ఠితంగా ఉంది. ప్రసిద్ధమైన 'శ్రీవిద్య'ను అనుసరించి ఇది విస్తరించిందని పండితులంటారు. ఈ మార్గంలోనే నేడు సమాజంలో కొత్త దేవుళ్ళకు, కొత్త దేవతలకు కూడా మంత్రాలు వెలుస్తున్నాయి! తంత్రం కొనసాగుతోంది! ఇది సమాజ గ్రహచారం! "గత్యానుగతికోలోకః"! సరే! ఇది ప్రాసంగికం. ఈ సంప్రదాయం లోనే ఆంజనేయస్వామికి కూడా ఎన్నో మంత్రాలు ప్రచారంలో ఉన్నాయి. జపించే వారికి, సాధకులకున్ను అవి ఇష్టసాధకాలవుతున్నాయి. తంత్ర, చక్ర, ముద్రాది ప్రక్రియ కూడా అవలంబింప బడుతున్నది.

**5. అధ్యాత్మ ద్వారం :** ఇదే తత్త్వద్వారం. ఇదే గర్భ ద్వారం. ఇదే పరమ పద ద్వారం. "ఓమితి బ్రహ్మ, ఓమితి ఇదం సర్వమ్, ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, అని శ్రుతిమాత ఘోషించింది. మాండుక్యోపనిషత్తు ఈ ఘోషణానికి వ్యాఖ్యానం చెప్పింది. నాదబిందు, తేజోబిందు, ధ్యానబిందు మొదలైన చిన్ని ఉపనిషత్తులు ఉపవ్యాఖ్యలు చేసేయి. అన్నింటి సారము ఒకటే. "ఓంకారమే పరమాత్మ" అని, "తస్య వాచకః ప్రణవః (పరబ్రహ్మకు ఓంకారం ప్రతీకం) అని యోగదర్శనం ఉపసంహరించింది.

మన హనుమ "ఓంకార స్వరూపుడే" అని పెద్దలు నిశ్చయించేరు. వేదాంతలో "సోఽహమ్" అన్నది "అజపా మంత్రం" దీనిలో సకార హకారాలను తీసివేస్తే ఓంకారమే మిగులుతుంది. (అకారం, ఉకారం, మకారం కలిసి ఓమ్ అని వింగడింపు గదా!) హనుమన్మంత్రాలన్నీ హనుమ యొక్క ఓంకార తత్త్వాన్నే విశదీకరిస్తాయని ఆయా గ్రంథాలలో సిద్ధాంతం చేయబడింది. (పంచాక్షరి, షడక్షరి, ద్వాదశాక్షరి మొదలైన హనుమన్మంత్రాలు ఉపాసనలో ఉపయోగించ బడుతున్నాయి.)

ఈ విధంగా మంత్రద్వారం పవమాన నందమని పరమాత్మ స్వరూపునిగా ప్రత్యక్షం చేయిస్తుంది. అందువల్లనే 1. రామాయణ ద్వారం, 2. పురాణ ద్వారం, 3. సంహితాద్వారం, 4. మంత్రద్వారం, 5. అధ్యాత్మ ద్వారం అన్న అయిదు ద్వారాలలో గర్భాలయ ప్రతిష్ఠితుడైన ఆంజనేయ స్వామి అయిదు ఆకారాలతో దర్శనమిస్తాడు. అతడే "పంచముఖుడు" (పంచముఖాంజనేయుడు) అని నా అభి సంధి (గట్టి నిశ్చయం) భవతు!

ఈ సందర్భంలో తత్త్వసారమైన కొన్ని మాటలను పొందు పరచాలని తోచింది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఏకమేం వాఽద్వితీయమ్ం" "సదేవసోమ్యేగమగ్ర ఆసీత్" "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "రసోవైసః" "ఆనందో బ్రహ్మ" మొదలైనవి వేదాంత భేరీ నినాదాలు. అనుభవానికి వచ్చినా లేక పోయినా అందరున్ను వింటున్నవే ఇవి. ఇది నిత్యసత్యతత్త్వం.

"రూపం రూపం ప్రతిరూపో బభూవ (బ్రహ్మమే నామ రూపాలన్నీ) "తత్ సృష్ట్వా తదేవాఽను పావిశత్" (నామ రూపాల్లో ఉన్నది ఆ బ్రహ్మమే)" సర్వాణి రూపాణి విచిత్య ధీరః! నామాని కృత్వా (అన్ని రూపాలు, అన్ని పేర్లున్న ఆ బ్రహ్మమే) "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" (ఒకే సత్యాన్ని వేర్వేరు ఆకారాలతో వేర్వేరు పేర్లుతో అనుభవిస్తారు) ఇది వ్యవహారం. (లోకం పోకడ) ఇదే ప్రపంచం.

అందుచేత సాధకుడు తనకభీష్టమైన సాధనను అవలంబించి, క్రమ క్రమంగా వ్యవహారాన్ని అతిక్రమించి (నామ రూపాలను విడిచి పెట్టి) "తత్త్వమసి" (పరవస్తువే నీవు) అన్న బోధను గ్రహించి, చివరకు "అహంబ్రహ్మాఽస్మి" అన్న స్వరూప స్థితిని పొందడమే పరమ పదమని సకల నిగమాగమసారం - సర్వ వేదాంత వేద్యం - సర్వశాస్త్ర సదుపదేశం!

ఈ సంవిధానంలో "హనుమదుపాసన"ను ప్రముఖంగా స్వీకరించవచ్చు. సందేహం లేదు. "యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి" అని భగవానుని ఉపదేశం. ఈ "హనుమత్ ప్రబంధము" యొక్క ప్రభావం కూడా ఇదే! నా "హనుమత్ద్దర్శనము" కూడా ఇదే!

ఇంతటి సద్గ్రంథం ఆంధ్ర ప్రజానీకానికి ఇచ్చి నందులకు కవిశేఖరులు శ్రీ కొండేపూడి సుబ్బారావుగారికి మరోసారి నా అభినందనలు.

పరమ ప్రీతితో ఈ మాటలను వ్రాసే అవకాశం నాకిచ్చినందుకు "కవిశేఖరు"లకు నమస్సుమాంజలిని అర్పిస్తున్నాను.

"ఓం తత్ సత్"

విశాఖపట్నం - 13
తే 16-7-2001
వృష, ఆషాఢ బహుళదశమి
సోమవారం - కర్కాటక సంక్రాంతి.

శ్రీరస్తు

# శ్రీ హనుమత్ర్పబంధము

## ప్రస్తావన

శ్రీ హనుమత్ర్పబంధము నందిది మూడవ భాగము. ఈ భాగముతో ఈ గ్రంథము సంపూర్ణము. మొదటి రెండు భాగములు పద్యకావ్యము లీవరకే వెలువడినవి. ఇది వచనము.

మొదటి భాగమున హనుమంతుని జననము మొదలు సముద్ర లంఘనమున కుద్యుక్తుడగు వరకు గల కథ ఉన్నది.

రెండవ భాగమున హనుమంతుని సముద్రలంఘనము మొదలు రావణ వధానంతరము శ్రీరామ పట్టాభిషేకము వరకు గల కథ కలదు.

ఈ మూడవ భాగము వచనము. హనుమానుని మహిమను దెలుపు వ్యాసములు, ఆతడు భక్తులను రక్షించిన కొన్ని కథలు గాథలు ఇందున్నవి. మొత్తమీ గ్రంథమంతయు హనుమత్పురాణమే అనవచ్చును.

శివాంశసముద్భవుడు సర్వసమర్థుడు మహాబలుడు వేదాంత వేది భక్తరక్షకుడయిన ఆంజనేయుని చరితము శ్రీ మద్రామాయణమున కొంతవరకే ఉన్నది. ఆ తరువాతనే ఆ మహనీయుని చరిత ఎక్కువ భాగము కలదు. పరాశరుడు మున్నగు మహర్షులు వ్రాసిన గ్రంథములందు హనుమానుని గూర్చిన మహిమావిశేషములెన్నియో ఉన్నవి. ఆ కథలు గాథలు దేశవ్యాప్తములై సకల జనాదరణీయములైనవి. సకల సంప్రదాయములవారికి ఆరాధ్యదైవముగా గ్రామ గ్రామములలో వెలసిన శివమూర్తి ఆంజనేయుడు - ప్రతిగ్రామమున పట్టణమున ఏ కూడలి యందో మహోన్నతము, సుప్రసన్నమైన ఆంజనేయ విగ్రహము, అభయహస్తముతో గదాయుధముతో ప్రత్యక్షముగ కన్పించును. కరుణా సింధువా హనుమంతుడు. భక్తాంజనేయునిగా వీరాంజనేయునిగా, భద్రాంజనేయునిగా, ధ్యానాంజనేయునిగా అభయాంజనేయునిగా, పంచముఖ ఆంజనేయునిగా ప్రజలా దైవతమూర్తిని వారి వారి యిష్టానుసారము రూపించుకొని సేవించి తరింతురు.

హనుమన్మహిమను గూర్చి ఋషులు ఎన్నియో విధముల పూర్వ గ్రంథములందు కొనియాడిరి. ఉమా సంహితలో "ఆంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకమ్" అని సంస్తుతింపబడినాడు. అనగా త్రిమూర్తుల యందున్న మహత్త్వ మా ఆంజనేయుని యందు కలదని భావము.

పరాశరసంహితలో ఆంజనేయః పూజితశ్చేత్ పూజితా సర్వదేవతాః హనుమన్మహిమాశక్యో బ్రహ్మణాపి నవర్ణితుమ్॥ హనుమన్మహిమను వర్ణించుట బ్రహ్మకైనను అసాధ్యమే. హనుమానుడు పూజింపబడినచో సర్వ దేవతలు పూజింప బడినట్లే. మఱొకచోట

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వమరోగతా।
అజాడ్యం వాక్పటుత్వంచ హనుమత్స్మరణాద్భవేత్॥

బుద్ధి కీర్తి నిర్భయము ఆరోగ్యం జ్ఞానము వాక్శక్తి మున్నగు సంపదలన్నియు హనుమానుని స్మరించినంత మాత్రమున లభ్యమగునని వచింపబడినది.

వాల్మీకి రామాయణమున సుందరకాండ అంతయు యశస్సుందరుడైన హనుమత్కథయే. ఇట్లే తులసీదాసు రామమానస చరిత హనుమాన్ చాలీసా సుప్రసిద్ధములు. పదపడి హనుమత్ప్రశస్తిని దెలుపుచు వ్రాయబడిన రామకథలు, కావ్యములు, శతకములు దండకములు స్తోత్రములు అష్టోత్తర శత సహస్రనామములు ఆంధ్రమున కోకొల్లలు - తన బుద్ధిపాటవమువలన, బలసాహసముల వలన, చిరజీవిగా భవిష్యద్బ్రహ్మగా వరము లందిన మహనీయ డతడు. సకల వేద శాస్త్ర వేత్త. నిష్కళంక పవిత్ర చరిత్రుడు - **కృతయుగమున తాటక ఖరదూషణులు మారీచసుబాహులు రావణ కుంభకర్ణ ఇంద్రజిదాదులు లోకకంటకులై విజృంభించిన సమయమున, శైవతేజసముద్భవుడై శ్రీరామునికి దుష్ట దైత్య నిర్మూలన కార్యమందు తోడ్పడిన పారమేశ్వర శక్తి హనుమానుడు.** దైవత కార్యసిద్ధి చరితాత్ముడైన కారణజన్ముడా హనుమంతుడు. నేటికిని గంధమాదనమున తపశ్శాలియై భక్త జనులను రక్షించుచున్న దైవతమూర్తి. ఇంతటి సుస్థిర భక్తి గౌరవ ఆదరాభిమానములతో భావింప బడుచున్న మహా మహిముడాతడు.

హనుమానుని చరిత మందున్న ఈ యీ మహత్తర విశేషములను కథలను గాథలను ఈ పొత్తమందు సవిస్తరముగా తెలుపుటకు ప్రయత్నము జరిగినది.

రామాయణ భారతాది ఇతిహాసములలో ఇతర గ్రంథములలోను చదివినవి, అటనట వినినవి హనువచ్చరితావిశేషవములు కూడ ఈ పొత్తమున పొందుపఱపబడినవి. భాషా ప్రవేశమంతగలేని వారును గ్రహింపవీలగు నట్లు సులభశైలిలోనే ఈ భాగము వ్రాయబడినది.

శ్రీ ఆంజనేయుని తత్త్వము ఊహించిన కొలది ఒక అనిర్వచనీయము మహోజ్జ్వల మైన దివ్య తేజము మన మానస గోచరమగును. సర్వదేవతా స్వరూపుడు, త్రిమూర్త్యాత్మకుడు, ఈశ్వరాంశ సంభూతుడైన హనుమానుని స్వరూప స్వభావములు ఇట్టివి అట్టివని వర్ణించుట అసాధ్యము. ఇట్టి మహా వీరుల నామస్మరణము కథాపఠనము శ్రవణము సమాజపురోగతికి రాజమార్గము.

వేదములను వేద ధర్మములను, వానిని విశదీకరించి బోధించు పురాణేతిహాసములను సంశయించు వారలింకను కలరు. వానిలోని ధర్మము లెట్టివి? లోకాస్సమస్తాస్సుఖినోభవంతు, సహనావతు సహనౌభునక్తు, మున్నగు సమాజ శ్రేయః ప్రదసూక్తులు, వాని నాచరించి చూపిన మహనీయుల చరిత్రలే కదా మనసనాతన సంస్కృతి. ఈ సమాజ నీతి నియమములు ధర్మములు కూడ అక్కరలేదందురా?

మఱి అట్టి ధర్మ ప్రవర్తనకు నిదర్శనములగు శ్రీరాముడు ఆంజనేయుడు దైవ మూర్తులో ఏమోగాని, వారి మహత్త్వమును గ్రహించి జీవన ధర్మమును అవగాహన చేసికొని అనుసరించినపుడే జాతికి పురోగతి. వారిరువురి శీలములు లోక కళ్యాణ ప్రదములు. దౌష్ట్యమును అధర్మమును సహించని సత్యపరాక్రమము వారిది.

అందుచేత హనుమానుని చరితమును మహర్షులు, శాస్త్రజ్ఞులు కవులు అనేక విధముల ప్రశంసించి వ్రాసి మనకందజేసిరి. సత్ప్రవర్తన శీలమే దైవవరము. భక్తుల పూజాఫల మనగా జన్మమునకు సార్థకతనిచ్చు ధర్మమార్గము. అదియున్నప్పుడు సర్వము విజయ ప్రదము. ఆ మహాత్ముల చరిత్ర నుండి మనము నేర్చుకొనవలసిన ధర్మమిదియే.

హనుమన్మహిమా విషయములను వివరించు ఈ గ్రంథము నాదరించి చదివిని, వినువారెల్లరు హనుమత్కృపానుగ్రహములకు పాత్రులగుదురు గాక.

## హనుమత్ప్రబంధము - మూడవ భాగము

## హనుమంతుని చరిత్ర - జననము

హనుమంతుని జన్మవృత్తాంతమును గూర్చి పాఠభేదములున్నవి. ఇవి యెట్లు సంభవించినవి అనిన పరీక్ష అంత ఆవశ్యకవముకాదు. యుగ యుగములనాటి గాథలివి. ఈ మధ్యలో ఏకారణము చేతనైనను ప్రక్షిప్తములు మార్పులు చేర్పులు వచ్చియుండవచ్చును. ఈ మార్పులు మహాపురాణములకే తప్పలేదు. కొందరు వారి వారి విశ్వాసములను బట్టి మూలమును లెక్క చేయక చేసిన మార్పులు వలె కన్పట్టును. ఏ కథ యెట్లు వ్యాప్తిలోనికి వచ్చినను హనుమంతుడు హనుమంతుడే. తన ప్రజ్ఞాపాటవఫలముగ బ్రహ్మాదులను గూడ మెప్పించి చిరజీవిగా వరములంది సర్వ ప్రజానీకముచే పూజలందుకొనుచున్నాడు.

ఈ వేర్వేరు కథలెట్లున్నను హనుమంతుని జన్మ చరితమున పరమశివుడు, అంజన, వాయువు ఈ మూవురు ముఖ్యులుగ నున్నారు. అదిచాలును. అయినను వివిధములైన కథలెట్లున్నవో చూతము.

1. (రామాయణము) పశ్చిమ సముద్ర తటమున వానరులు నివసించు ప్రదేశమొకటి ప్రభాసతీర్థమను పేర ఉన్నది. ఆ చుట్టు ప్రక్కల నున్న అడవుల నుండి ఏనుగులు వచ్చి వారి నివాసము పాడుచేయుచుండెను. ఒకనాడు శంఖము శబలము అను రెండేనుగులు ఊరిపై బడి విధ్వంసము చేయుచుండగా ఆ తీర్థము నందున్న వానరులు చెల్లా చెదురుగ పారిపోదొడగిరి. వారియందున్న వీరుడొకడు ఆ యేనుగులతో పోరాడి వానిని జంపెను. ఏనుగులను చంపగలిగిన వాని పరాక్రమమును మెచ్చుకొని ఆ ప్రాంతముల నున్న భరద్వాజుడను ముని వానికి కేసరి యను నామమిడి, అతనికి మహాబలాఢ్యుడు సర్వవంద్యుడు అయిన పుత్రుడు కూడ కలుగునని వరమిచ్చెను. ఆ ప్రభాస తీర్థము నందున్న కుంజరుడను వానరముఖ్యునకు అంజనయను పుత్రిక కలదు. ఆమె కడు సౌందర్యవతి. బలవంతుడగు అల్లుని కొరకు వెదకుచు కుంజరుడు తనకుమార్తె అంజనను కేసరికిచ్చి వివాహమొనర్చెను. ఆ దాంపత్యమెన్ని నాళ్ళో సాగలేదు. వివాహమైన కొన్ని నాళ్ళకే కేసరి విరాగియై తపస్సునకేగుచు అంజనను పిలిచి

"వాయుదేవుని పూజించుకొనుము ఆ దైవమూర్తివలన అజేయబలుడు, మహావిద్వాంసుడు, పరమభక్తుడగు సుతుడు నీకు ఉదయింపగలడు, క్రూర రాక్షస విధ్వంసకుడై ఆసుతుడు మహా కీర్తిమంతుడగును, ఈ సాంగత్యము వలన నీ శీలమునకు ఎట్టి లోపము రాదు" అని కూడ చెప్పెను. భర్త ఆకస్మికముగ విరాగియై తనను విడచి యేగుట అంజనకు అపార దుఃఖము కలిగించెను. ఏమియు తోచక ఆమె విచార మగ్నయై దినములు యుగముల వలె గడపు చుండెను. క్రమముగా ఆ దుఃఖమునుండి తేరుకొని ఒకనాడు అంజన ప్రభాసతీర్థము వద్దనున్న సరస్వతీ నదీతీరమున తిరుగుచుండగా ఆమె సౌందర్యమును చూచి వాయువు వలచివచ్చి ఆమెను కలియగా బాలభాను డనదగిన ఒక మహాతేజస్వియగు కుమారుడు కలిగెను. "వాయుదేవుడామెను విడచియేగుచు దేవీ నీవు విచారింపకుము. ఈ కుమారుడు నా వద్దనున్న శివతేజము వలన జన్మించినవాడు. మహావీరుడు, మహాజ్ఞానియునై జగత్ ప్రసిద్ధి బడయగలడు. నీ మాతృత్వమునకేలోపము కలుగదు అని చెప్పి వెడలెను. ఆ అటవీ ప్రాంతమున ఆ పసిబిడ్డకు జాతకర్మములు చేయించు వారెవరు? నామకరణము చేయువారెవరు? ఈశ్వరుడే శరణ్యము. అంజన యొక్క కుమారుడు గాన ఆంజనేయుడని పేరు వచ్చినది. ఇది అన్ని చోట్లను వ్యాప్తినందిన గాథ; సుప్రసిద్ధమైన కథ.

2. (విచిత్ర రామాయణము) గౌతమ మహామునికి భార్య యగు అహల్యవలన కలిగిన కొమరిత అంజన. అహల్య చాలసుందరి. సూర్యుడామెను మోహించి సుఖింపగా పుత్రుడొకడు కలిగెను. తరువాత మరియొక పుత్రుడును కలిగెను. ఈ రహస్యము నెఱిగిన అంజన ఆమె తండ్రి గౌతమున కీమాట చెప్పగా అతడు ఈ మగపిల్ల లిరువురును అహల్యకు అక్రమ సంతానమైనచో వానర ముఖులగుదురు గాక యని శపించి సముద్రమున బడవైచెను. వారిరువురు కోతి మొగములతో బయటకు వచ్చిరి. వారే వాలి సుగ్రీవులు. తన గుట్టును బయట పెట్టినందులకు అహల్య "అంజనను గ్రుడ్డిదానవగుదువు, నీకు వానరుడొకడు పుత్రుడగును గాక" యని శపించి అడవులకు బంపెను. ఈ కథ చాల అసంబద్ధముగా నున్నది.

ఉత్తర రామాయణమున వాలి సుగ్రీవులను గూర్చిన కథ వేఱుగనున్నది. ఋక్షవిరజుడను వానరముఖ్యుడు కాననము లందు తిరుగుచు, పార్వతి వలన శాపము నందిన కొలనులో స్నానమాడి ఒక సుందర స్త్రీయై బయటకు వచ్చెను. ఆమెను చూచి ఇంద్రుడు మోహించి కలియగా పుట్టిన వాడు వాలి. సూర్యుడు కూడ ఆమెను వలచి కలియగా పుట్టిన పుత్రుడు సుగ్రీవుడు - మఱునాడే ఋక్షవిరజుడు నిజరూపము దాల్చి వాలి సుగ్రీవులను తీసికొని వెడలి కిష్కింధ రాజ్యమును స్థాపించెను. ఇదియే వాడుకలోనున్న కథ. ఇందు అంజన ప్రసక్తియే లేదు.

3. అంజనను ప్రథమమున వివాహమాడిన కేసరియే వాయువు. రావణాది రాక్షసులను సంహరించుటకు దేవతలేగి పరమశివుని సాహాయ్య మడుగగా పరమశివుడంగీకరించెను. రావణుడు మహాశివ భక్తుడు. తన భక్తుని తానై సంహరించుట తగదని పరమశివుడు తన తేజమును వాయువునందుంచెను. వాయువే కేసరి రూపమునందెను, పుంజకస్థలయను అప్సరస దేవలోకమున రావణునిచే బలాత్కరింప బడి తన పగ తీర్చుకొనుటకు భూమిపై అంజనగా జన్మించినది. ఈ అంజనను కేసరి నిజ వాయుస్వరూపమున వివాహమాడి శివాంశ కలిగిన పుత్రుని కనెను. ఆ శిశువే హనుమంతుడు.

వాల్మీకి రామాయణమున, హనుమంతుడు రావణాసురునితో మాట్లాడుచు తాను వాయుదేవుని పుత్రుడనని చెప్పినాడు.

"అహంతు హనుమన్నామ మారుతస్యౌరసపుత్రః" ఔరస పుత్రుడనగా నిజధర్మపత్ని యందు పుట్టినవాడని యర్థము.

ఇచ్చట పుంజకస్థలను గూర్చి కొంత చెప్పవలసియున్నది. ఈమె ఒక అప్సరస, దేవలోకమును నానాభీభత్సము చేయుచున్న రావణుని చూచి భయపడి దాగి బ్రహ్మలోకమునకు పారిపోవుచుండ ఆమెను బలిమిని పట్టి రావణుడు రమించెను. పుంజకస్థల యెట్లో తప్పించుకొని బ్రహ్మతో మొఱపెట్టినది. రావణునిపై బ్రహ్మకోపించి "నీవిక పరస్త్రీనిట్లు బలాత్కరించినచో నీ తల వేయిముక్కలగు" నని శపించెను. రావణుని పై ప్రతీకార వాంఛతో బ్రహ్మదేవుని ప్రార్థించి పుంజకస్థల

వరములంది అంజనయై జన్మించినది. బ్రహ్మ అనుగ్రహమున వాయుదేవుడే ఆమెను వివాహమాడి తత్ఫలితముగ శివాంశయు మహాశక్తి స్వరూపుడగు ఆంజనేయుని కనినది. సుగ్రీవునితో మైత్రి, సీతాన్వేషణము, రావణాది దైత్యుల సంహారము, సీతా రాములకలయిక మున్నగు సందర్భములలో హనుమంతుని పాత్ర ప్రధానమైనది.

పుంజకస్థల కథ రామాయణమందున్నది. రావణుడు సీతను చెఱబట్టి లంక యందుంచినాడు. ఆ దైత్యేంద్రుని కొలువులో నున్న మహాపార్శ్వుడను మంత్రియొకడు రావణుని కొకసలహా చెప్పినాడు "ప్రభూ! నీవు త్రిలోకములను జయించిన మహాబలుడవు నీకు అడ్డు చెప్పు వారెవరునూ లేరు. త్రిలోక సుందరి, సీత నీకు దగిన స్త్రీ. బలిమిని భోగింపుము" అనగానే రావణుని ఒడలు జలదరించినది" మంత్రీ! నీవు చెప్పవలసినది చెప్పినావు. నాకా అదృష్టములేదు. పరస్త్రీని యిక బలిమిని ముట్టుకొనినచో నాతల వేయి భిన్నములగునని బ్రహ్మశపించినాడు" అని పుంజకస్థలయను అప్సరసను తాను బలాత్కరించిన పనికి పరిణామమును చెప్పినాడు.

రామాయణములోని ఈ క్రింది వాక్యములీ కథకు సంబంధించినవే

పితామహస్య భవనం గచ్ఛన్తీం పుంజకస్థలా
చంచూర్యమాణామద్రాక్ష మాకాశేగ్నిశిఖామివ
సాప్రసహ్య మయాభుక్తాకృతావివసనాతత
అథఃసఃకుపితోదేవో మామిదంవాక్య మబ్రవీత్
'అద్య ప్రభృతి''యా మన్యాం బలవన్నారీగమిష్యసి
తదాదే శతధామూర్ధా ఫలిష్యతి నసంశయః

ఈ వృత్తాంతము మొదట నున్న కథకు దగ్గరగా ఉన్నది. కేసరి అంజనల పూర్వవృత్తాంతమును తెలుపుచున్నది.

విషయ వివరణమెట్లున్నను హనుమ శివాంశసంభూతుడని, అజేయ బలసాహసోపేతుడని కారణజన్ముడని పూర్వ గ్రంథములను బట్టి స్పష్టముగ తెలియుచున్నది.

# హనుమదవతారము

మహానదుల పుట్టుకకు మహాత్ముల జన్మమునకు జగత్కళ్యాణ ప్రదమ్మైన పరమార్థమేదియో దైవనిర్ణీతమ్మై యుండును. దైవ సంకల్పములు నెరవేరితీరును. సాక్షాద్విష్ణ్వవతారుడు శ్రీరాముడు. దుష్టశిక్షణకు శిష్టరక్షణకు దర్మసంస్థాపనకు జన్మించిన మహా పురుషుడు. త్రిలోక కంటకులయిన రావణాదులను పరిమార్చిలోకమునకు శాంతి సౌఖ్యములు గల మార్గమేర్పరచినాడు. ఈ కార్యనిర్వహణమున ప్రధాన పాత్ర వహించిన వ్యక్తి హనుమంతుడు. వీరిరువురి కలయిక వెనుక ఒక విశిష్టమగు ప్రత్యేకత ఏమ్మైన ఉన్నదా అను విషయము సూక్ష్మముగా పరిశీలించదగియున్నది. అంతేకాక రామాంజనేయుల కలయిక హరిహరాత్మకమయిన ఒక మహాశక్తి. ఇంతటి శక్తి ప్రాదుర్భవించుటకుగల కారణమును గూడ విశదముగ తెలిసికొనవలసిన ఆవశ్యకతయున్నది. ఈ దృక్పథము నుండి పరిశీలించినపుడే హనుమంతుని సరియ్యైన స్వరూపము అవగతమగుటకు వీలుకలుగును.

హనుమంతుడు శివావతారము - ఈ విషయము వ్యాస మహర్షి వ్రాసిన పదునెమ్మిది పురాణములలో నాల్గవదియగు శివమహాపురాణము రుద్ర సంహిత కుమార ఖండము 20వ అధ్యాయమున విపులముగ నున్నది. ధర్మ సంస్థాపనము కొరకు పరమ శివుడెన్నియో అవతారము లెత్తెను. వానిలో హనుమదవతారము ముఖ్యమ్మైన అవతారము.

ఒకానొక సమయమున విష్ణువు మోహినీ రూపమును దాల్చగా ఆమె సౌందర్యమునకు శంకరుడు చలితమనస్కుడై తన వీర్యమును విడిచెను. ఆ సంఘటనము రామ కార్యార్థము జరిగినదే ఆ వీర్యమును సప్తర్షులు దాచి యుంచిరి. తుదకా వీర్యమును అంజనీదేవి చెవిలో వేయగా ఆమె గర్భవతియ్యై ఒక కుమారుని ప్రసవించెను. శంకరుడే మహా బల పరాక్రమములుగల వానరుడుగా ఉదయించెను. ఆతడే హనుమంతుడు.

శివుడు హనుమంతుని రూపమున లోకమున చూపిన లీలావిలాసము లద్భుతములు. హనుమద్రూపమున శివుడే దుష్టరాక్షస విధ్వంసమున శ్రీరామునికి

తోడ్పడెను. రావణ వధానంతరమున హనుమంతుని దుష్ట శిక్షణ శిష్ట రక్షణ కార్యములెన్నియో యున్నవి.

అది కృతయుగము. శ్రీరాముని కాలము నాటికే శ్రీమన్నారాయణుని అవతారములు ముఖ్యమైనవి అయిదైనవి.

1. ఏవి భరత వర్ష సంస్కృతికి ధర్మమునకు ఆధారములైనవో ఆ వేదముల నపహరించి సాగర గర్భమున దాగినాడు సోమకుడను రాక్షసుడు. ఆ వేదముల నుద్ధరించుటకు శ్రీ విష్ణువు మత్స్యమైవచ్చి సోమకుని ద్రుంచినాడు.

2. రాక్షసుల బాధ నుండి దేవతలకు రక్షణ కావలెను. క్షీర సాగరమున నున్న అమృత సేవనమే దానికి మార్గము. దానవులు మాత్రము తక్కువ వారా! వారును అమృతమున కాసించి సముద్రమథన మారంభించిరి. కవ్వముగా నున్న కొండ సముద్ర జలమున మునుగగా శ్రీ విష్ణువు కూర్మమై కొండను తన వీపుపై నిలిపి నాడు. అమృతమునకు బదులు హాలాహల విషాగ్నులు ప్రబలి లోకము దగ్ధమగుటకు సిద్ధమైనది. శివుడు తానే వచ్చి ఆ విషమును పట్టి తన గళమున బంధించినాడు. తరువాత లభించిన అమృతము దేవతల కందించుటకు మధ్యగా విష్ణువు మోహిని ఆకారమున రావలసివచ్చినది.

3. హిరణ్యాక్షహిరణ్యకశిపులు మహాదుష్టులైన దానవ సోదరులు. భూమి లేకుండ జేసినచో జనులందరు మడియుదురు గదా అని హిరణ్యాక్షుడు భూమిని చాపగా చుట్టి సముద్రమున త్రోసినాడు. శ్రీవిష్ణువు మహావరాహమై హిరణ్యాక్షుని ద్రుంచి తనముట్టెతో భూమిని పైకెత్తినాడు.

4. తన అన్నగారిని చంపిన విష్ణువుపై వైరమూని హిరణ్యకశిపుడు విష్ణుభక్తులను పారద్రోలి, హరి భక్తుడైన తనకుమారుని ప్రహ్లాదునే చంపయత్నించినాడు. శ్రీవిష్ణువు నృసింహరూపమై హిరణ్యకశిపుని చీల్చిచంపి విష్ణుభక్తులను రక్షించినాడు.

5. బలి చక్రవర్తి రాక్షస కులాధిపతి. రాక్షసుడైనను దాన బుద్ధి గల విశాలహృదయుడు. తన రాజగర్వము బలగర్వము చూచుకొని బలి యింద్రాదులైన దేవతలనే అవమానించుటకు సిద్ధపడెను. శ్రీ విష్ణువు వామనుడుగా అదితి కశ్యపుల కుద్భవించి ఒకవటువురూపమున, యజ్ఞము చేయుచున్న బలివద్దకు పోయి,

తనకు మూడడుగుల నేల చాలునని అడిగి పుచ్చుకొని ఒకపాదమున భూమిని ఒక పాదమున ఆకాశము నాక్రమించి మూడవ అడుగు భాగమునకు బలిశిరము మీదనే పాదముసుంచి పాతాళమునకణగద్రొక్కెను.

6. కొందరు రాజవంశీయులు మహాదర్పితులై ప్రజలను మునులను హింసింప మొదలిడిరి. ఈ దౌష్ట్యము నరికట్టుటకు శ్రీ విష్ణువు భృగుమహర్షికి తనయుడై జన్మించెను. అకారణముగ భృగుమహర్షినే దుష్టులగు కొందరు రాజన్యులు వధించిరి. ఆ మునికుమారుడు పరశురాముడు విష్ణుని అవతారము, ఇరువది యొక్క మారులు దాడివెడలి దుష్టులైన రాజన్యులనెల్ల సంహరించి పితృ తర్పణమొనరించెను.

ఈ సంఘటనలతో ఆగలేదు. త్రిపురాసురులు విజృంభించి నపుడు పరమ శివుడే వచ్చి సంహరించినాడు. మహిషాసురుని తదనుచరులైన చండముండులను రక్త బీజాదులను త్రుంచుటకు పరాంబికాదేవియే, కాళీదుర్గా రూపముల వచ్చినది.

ఈ గాథలను పరిశీలించినచో ఒక్కొక్క రాక్షసుడు ఎంత బలవంతుడో విశదమగును. వారినణచుటకు వైకుంఠమున నుండి విష్ణువో, కైలాసమున నుండి శివుడో రావలసి వచ్చినది. కాలము గడచినది. రాక్షస సమూహము కూడగట్టుకొని బలవంతులయినారు. వారి మతము దుర్మార్గము. వారి లక్ష్యము నరసురముని వ్రాతములహింసించుట, యజ్ఞ యాగాది సత్కార్యములు సాగకుండ ధ్వంసము చేయుట వారి స్వభావము. వారి ప్రవర్తన కామక్రోధలోభమోహ మద మాత్సర్యముల కూడిక. వారి గుణము తమోగుణము. తుదకు పైనుదహరింపబడిన రాక్షసులు కొన్ని వందల మంది కూడిన మహోపద్రవమే పుడమికి వచ్చినది. దేవతా పూజలు చెల్లవు, అగ్నిహోత్రములు వెలుగవు, క్రతువులు సాగవు. స్త్రీలకు రక్షణలేదు. ఇది ఆనాటి జగత్పరిస్థితి.

ఇట్లు విజృంభించిన దుష్ట రాక్షసవర్గము రావణాసురుని వంశీయులు, అనుచరులు, సహచరులు. రావణుడెవ్వడో కాదు. బ్రహ్మ మానసపుత్రుడు పులస్త్యబ్రహ్మ కుమారుడు. భరతవర్షమున దక్షిణమున నున్న లంకలో దానవరాజ్యమేర్పడినది. రావణుడు లంకాధిపతి. దానవముఖ్యులెల్లరు మంత్ర

తంత్రములు నేర్చినారు. తపస్సులు చేసినారు. వరములంది నారు. సిద్ధులు పడసినారు. అవసరమగు కామ రూపముల ధరించు శక్తులు సంపాదించినారు. ఈ శక్తులకు తోడు దారుణ మారణా యుధములను సమకూర్చుకొనగలిగినారు. నేల నలు ప్రక్కల ఈ దుష్టులు అల్లుకొనిపోయినారు. ఉత్తరమున తాటక యను మహారాక్షసి, దండకాటవిలో ఖరదూషణాదులు. దక్షిణమున లంక దానవరాజ్యము- రావణునకు అడ్డేమి ఉన్నది. అతడు మహా శివభక్తుడు మహాతపశ్శాలి మనుష్యులన్నచో అతనిముందు పురుగుల కన్న హీనము. మనుష్యుల లెక్కయేలేదు. వారివలన తనకు ఏ చిక్కునులేదు అనుకొనినాడు. తక్కిన దేవతలు దిక్పతులు నాగగరుడ గంధర్వ కిన్నరాదులు ఎవరి వలనను చావులేకుండ బ్రహ్మచే వరములందినాడు. రావణుని కొడుకు మేఘనాథుడును అంతటి వాడే. అతడు హోమమొనర్చి వచ్చినచో ప్రపంచమున ఎవ్వరును, దేవుడైనను అతని నెదుర్కొనలేరు. ఇంద్రుని జయించి ఇంద్రజిత్తు అని ప్రసిద్ధనామము నందినాడు. రావణుని తక్కిన కుమారులు అక్షయుడు మున్నగు వారు కూడా దుర్వారబలులు. సోదరుడు కుంభకర్ణుడు పర్వతమంత మనిషి. వాని ఉచ్ఛ్వాస నిశ్వాసముల వేగమునకు పర్వతము లెగిరిపోవునంతటి బలుడు. ఇక వీరి అనుచరులు ఒకరిని మించిన వారొకరు. వీరిముందు త్రిలోకములు తల్లడిల్లిపోయినవి. భూదేవి ఘోషించినది. బయటకు వచ్చుటకు సూర్య చంద్రులే భయపడి ప్రక్కకు తొలగినారు. జగత్తున కింతటి విపత్తునా పుటకు ఎంత శక్తి కావలసి యుండును. ఇక దేవుడే దిక్కు.

రావణుడు తనదర్పాతిశయముతో కామాంధుడై తన చావునకు తానే కారణములు కల్పించు కొనుచు వచ్చినాడు. కన్ను మిన్నెరుగక చేసిన దురితముల ఫలమిది. పుంజకస్థల మాన భంగము కారణముగ బ్రహ్మ శాపమున్నది. ఒక సమయమున దివియందు రంభను బలాత్కరించి నలకూబరుని శాపము నందినాడు. మునికన్యయగు వేదవతిని బలిమిని పట్టబోయినందులకు తత్ ప్రతీకారముగ ఆమెయే లక్ష్మీ అంశ కలిగిన సీతగా జనకునింట జన్మించినది. మూడు విధములుగస్త్రీ శక్తి రావణుని అంతము కొరకు ఎదురు చూచుచున్నది.

ఇక మరొక ప్రక్కనుండి బ్రహ్మను ఇంద్రుని తోడ్కొని సురలు మునులు వైకుంఠమున శ్రీ విష్ణువుకడ కేగి మొఱపెట్టుకొని - రావణుని ముందు

లోకములాగవని విలపించిరి. ఒక్క మానవుని వలనగాని రావణునకు చావులేదని శ్రీవిష్ణువెరుగును. కరుణా సింధువు శ్రీహరి దేవతల కభయహస్తమిచ్చినాడు. క్రూర రాక్షస నిర్మూలమునకు నేను త్వరలోనే వత్తును, ముఖ్యదేవతలు వానరులైతనకు సాయముగనుందురని నుడివి, రావణుడు పరమశివుని మహాభక్తుడగుటయు గమనింప వలసినదిగా జ్ఞప్తి చేసి పంపెను. తమ కొకదారి దొరకవలెను లేదా బ్రతుకులుండవు. దేవతలు కైలాసమునకేగి మహాశివుని అనుగ్రహము సంపాదించినారు. రావణుప దౌష్ట్యము పరమ శివుడెరుగును. తన భక్తుని పరిమార్చుటకు తానయిరాడు. భక్తుడని ఉపేక్ష వహించినచో లోకములకు ప్రళయమే సంభవించునట్లున్నది. ఏదో ఉపాయము తానై చూడవలయును. మహాశివుని ఆంతర్యము గ్రహించిన దేవతలకు మునులకు కొంతభయము తగ్గినది. క్రూర రాక్షస నిర్మూలము ఎప్పుడెపు డాయని దినములు లెక్కిడుచున్నారు.

ఇక ఆలస్యమెంత మాత్రమును తగదు. హరి హరులు వారే తొందరపడుచున్నారు. కోసల దేశాధిపతి దశరథుడు మహాబలవంతుడు దేవేంద్రునకు దేవదానవ యుద్ధమున ఎంతయో సాయము చేసినవాడు. ఆ మహారాజిప్పుడు బ్రహ్మర్షియు కులగురువునైన వసిష్ఠునాదేశమున పుత్రులకొరకు యాగమునొనరించుచున్నాడు. యాగము ఫలించినది. యజ్ఞపురుషుడు ప్రత్యక్షమయి పాయసమిచ్చినాడు. మంచి సమయముగా కనుపించినది. ఆ రాజు భార్యలు పాయసమును సేవించినారు. పెద్ద భార్య కౌసల్య గర్భమున శ్రీహరి శ్రీరామునిగా జన్మించినాడు. రెండవ భార్య సుమిత్ర యందు లక్షణ శత్రుఘ్నులు కవలలుదయించిరి. అనంతుడు ఆదిశేషుడు లక్ష్మణుడై అవతరించినాడు. శత్రుఘ్నుడు చక్రము అంశతో జన్మించెను, మూడవ భార్యకైకయందు శంఖము అంశమున భరతుడు ఉదయించినాడు శ్రీహరి అవతారము శ్రీరామునిగా పూర్తి అయినది.

రావణునెదిరింపగల మహాబలుని పుత్రునిగ పొందుటకు పుంజకస్థల అంజనగా జన్మించినది. వాయుదేవుడామెను, వలచి తనయందున్న శివతేజముగల పుత్రునిగనెను. ఆ మహాతేజస్వియే ఆంజనేయుడు. ఆంజనేయునకు శ్రీరాముని

సాంగత్యము లభించినది. రాక్షస విధ్వంసమునకై హరిహరాత్మకమైన మహాశక్తి కావలసి వచ్చినది. హరిహరులిట్లు రామాంజనేయులుగా అవతరించిరి.

శ్రీరాముడు వీరనారాయణుడు. హనుమంతుడు శివశక్తి స్వరూపము. ఈ మహిమలు రెండును కలిసిన మహాశక్తియే రావణునితో పాటు ఆనాటి దానవదౌష్ట్యమును అంతమొందించుట కావశ్యకమైనది. దేవతలును, వానరరూపులై ఈ బృహత్కార్యమున సాయపడవలసిన ఆవశ్యకతయు కలిగినది. ఇది హనుమదవతార కథ.

# ఆంజనేయుని గొప్పతనము

ఆంజనేయుడు శివస్వరూపమని అతని జన్మగాథయే విశదము చేయుచున్నది. ఆ దివ్య పురుషుని గొప్పతనమును వర్ణించుట ఎవరికిని శక్యము గాదు. అయినను ఆ మహాత్ముని గొప్ప తనమును గూర్చి పూర్వగ్రంథములలో వ్రాసియున్న కొన్ని వృత్తాంతములను చెప్పుకొందము.

పూవు పుట్టగనే పరిమళించును. ఆంజనేయుని బలసాహసములట్లే శిశు ప్రాయమునందే వెల్లడియైనవి. ఆంజనేయుడు శివాంశ సముద్భవుడు గనుకనే సహజకవచ కుండలములు పసిడి జన్నిదములతో జన్మించినాడు.

తల్లి అంజన తన బిడ్డను అల్లారు ముద్దుగా పెంచుకొనుచున్నది. మూడు దినముల పసికందు. పాలు చాలక బిడ్డ పోరుపెట్టుట తల్లి భరించలేకపోయినది. ఆ బిడ్డను మెత్తని పూ పాన్పుపై పరుండ బెట్టి, పండ్లు తెచ్చి పిల్లని కా పండ్లరసము పట్టింపవలెనను ఆసతో దగ్గరనున్న అడవిలోనికి ఏగినది. ఉదయమైనది. బాలభానుడు బంగారు కాంతులతో పైకి వచ్చుచున్నాడు. ఆ బింబమును చూచి ఆంజనేయుడు ఏదో పండని తలచి, ఆకసమున కెగిరినాడు. ఆ వేగము ఆ తేజము ఆ విగ్రహము చూచి గగన చరులయిన కిన్నర కింపురుష గంధర్వాదులు భయపడి చూడసాగిరి. తనకు ఆహారము కావలసిన సూర్యుని మ్రింగుటకు ఏదో భూతము వెళ్ళుచున్నదని రాహువు అడ్డురాగా ఆంజనేయుడు రాహువుపై పడబోవునంతలో స్వర్గముపైకి ఎవరో రాక్షసుడు వచ్చుచున్నాడని దేవతలేగి ఇంద్రునికి చెప్పిరి. వెను వెంటనే ఇంద్రుడైరావతమునెక్కివచ్చి ఆంజనేయునిపై వజ్రాయుధమును ప్రయోగించినాడు. అది ఆంజనేయుని హనువునకు తాకగా ఆ ధాటికాగలేక ఆంజనేయుడు క్రిందబడినాడు. తండ్రియగు వాయువిది చూచి, "పసిబిడ్డ అనికూడా భావించక లోకపాలకుడైన ఇంద్రునకింతటి దౌర్జన్యమా!" అని ఒక్కసారిగా వాయుచలనమును ఆపెను - లోకములకు ప్రాణవాయువు లేదు. ప్రాణికోటి ఒక్కుమ్మడిగా చనిపోవు విపత్తేర్పడినది. బ్రహ్మాదులు భయపడి వచ్చి వాయుదేవుని ప్రార్థించి ప్రాణవాయువును లోకమున ప్రసరింపచేసిరి. ఆ పసిబాలుని మూర్ఛదేర్చి ఎచ్చటను కనివిని యెఱుగని అతని జవ సత్వములకు సాహసమునకు అద్భుత పడి ఈతడు దైవత కార్యసిద్ధి చరితాత్ముడును, చిరజీవియు కాగలడని దీవించి బ్రహ్మాదులు వెడలిరి.

పండ్లతో ఇంటికి తిరిగి వచ్చిన అంజనతన బిడ్డను కానక ఎవరో రాక్షసులెత్తుకొని పోయినారని గోలు గోలున ఏడ్చు చున్నంతలో వాయు దేవుడా బిడ్డను తీసికొని వచ్చి తల్లికిచ్చి జరిగిన కథనంతయునుడిడెను. తన హనువు (చెక్కిలి) నందు దేవేంద్రుని వజ్రాయుధమునే ఆపిన బలవంతుడగుటచే ఆంజనేయున కానాటినుండియు హనుమంతుడను పేరు వచ్చినది. తమ బిడ్డ తమకు దక్కినందులకు తల్లిదండ్రులు సంతసించిరి.

హనుమంతునకు విద్యాభ్యాసమునకు తగినయీడు వచ్చినది. జ్ఞానతేజో రూపుడయిన సూర్యునివద్ద కాతనిని తల్లిపంపినది. సూర్యుడా బాలుని జూచి "ఉదయాస్తమానములు ఆకసమున అటునుండి యిటకు తిరుగాడు నా వద్దనా నీవు విద్యనభ్యసించుట" అని పరిహాసమాడగా, హనుమంతు డా భాస్కరునకు నమస్కరించి "గురుదేవా! నీవూహించిన చిక్కేమియు ఉండదు. ప్రతి నిముషము నీ ముందు నుండగలనని మహా రూపుడై ఉదయాద్రి యందొక కాలు అస్తాద్రియందొక కాలు నిలిపి నిలుచుని దినమునకొక విద్యచొప్పున చతుష్షష్టికళలను వేద వేదాంగ శాస్త్రములును నేర్చి ఆంజనేయుడు మహా విద్వాంసుడయ్యెను. హనుమంతుని మేధా శక్తి సామర్థ్యములకు సూర్యుడే ఆశ్చర్యపడి "హనుమా! నీవెంత వాడవయినను కాగలవు. నిన్నెదిరింపగల వారెవరును ఉండరని" దీవించిపంపెను. చిన్ననాడు ఆకలి కాగలేకపోయిన పసిబిడ్డ మహాబలసాహసుడై మహా పండితుడై వచ్చి తల్లికి నమస్కరించినాడు. తల్లి అంజన ఆనందమునకు మేరలేదు. తల్లి దీవెనలు అనుజ్ఞగొని హనుమంతుడు కిష్కిందలో వానర వీరుడైన సుగ్రీవుని వద్ద చేరినాడు. దైవనిర్ణయమది.

శ్రీరాముడు, బాల్యమునందే విశ్వామిత్రముని క్రతువును రక్కసుల బారినుండి రక్షించుటకేగుచు, దారిలో అడ్డుగా వచ్చిన తాటకను చంపినాడు. క్రతువును ధ్వంసము చేయవచ్చిన సుబాహుని చంపి, మారీచుని పారద్రోలినాడు. తండ్రి దశరథుని కోరికపై భార్య సీతతో గూడి రాముడు లక్ష్మణసహితుడై వనవాసమేగెను. వారు దండకాటవిలోనుండగా శూర్పణఖయను రక్కసి కామాంధయై పైకి రాగా లక్ష్మణుడామెను కురూపిగ జేసి పంపెను. ఇవి యన్నియు విని రామునిపై పగ తీర్చుకొనుటకు రాముడింట లేనప్పుడు మారు వేసమున మునియై వచ్చి రావణుడు సీతనపహరించి లంకలో చెఱబెట్టెను.

సీతాపహరణము తర్వాత రామకథలో అన్ని ఘట్టములందును ప్రధాన పాత్ర హనువంతునిదే. శ్రీరామ దర్శనము, రామ సుగ్రీవుల మైత్రి, సముద్రలంఘనము, సీతాన్వేషణము, సీతాదర్శనము, అక్షయకుమారాది రాక్షసుల వధ, రావణునితో సంభాషణ, లంకాదహనము, సీతను చూచిన వార్త రామునకు తెల్పుట, రాముని వెంట వానరసేన వారధి కట్టి లంకను జేరుట, రామరావణ యుద్ధము - సంజీవని తెచ్చి లక్ష్మణుని బ్రతికించుట. రావణ వధానంతరము - సీతారాములు పుష్పకముపై అయోధ్యకు చేరు సమాచారము భరతునకు తెల్పుట. ఇవి యన్నియు రామాయణములోని ముఖ్యఘట్టములు. హనుమంతుని సామర్థ్యమును తెల్పునవియే. రావణుని ఆయుధహతికి నిశ్చేష్టుడయి పడిన లక్ష్మణుని బ్రతికించుటకు సంజీవని అవసరమైన సమయమున జాంబవంతుడొక సంగతి చెప్పెను. చూడుడు, హనుమంతుడెక్కడ ఉన్నాడో, అతడు బ్రతికి యున్నచో అందరమును బ్రతికి నట్లే. అంతటి మహిమ అతనికున్నది. ఆతడే హిమాద్రికేగి సంజీవని తేగలడు అనెను.

ఇచ్చట నొక విషయము తెలిసి కొనదగినది. దుష్టులు తమ దుష్ప్రవర్తన చేత తమ గోయి తామే త్రవ్వుకొందురు. రావణుని పాపము బ్రద్దలైనది. శ్రీహరి అంశయగు శ్రీరాముని భార్య సీత నపహరించినాడు. పరమశివునంశయయిన హనుమంతుని తోకకు నిప్పంటించి చంపజూచినాడు. ఫలితము తనసర్వనాశనము.

రామాయణములో సుందర కాండకు మహత్తర ఖ్యాతి ఉన్నది. ఈ కాండను మంత్రశాస్త్రతుల్యముగనే పండితులు భావింతురు. సుందర కాండ కథకు నాయకుడు హనుమంతుడు. ఈ మహనీయుని గొప్పతనము గల సుందర కాండ వలననే రామాయణమున కంతటి ప్రాముఖ్యము వచ్చినదను మాట అత్యుక్తికాదు. ఈ కాండలోనే హనుమానుని విక్రమ సాహసములు, వివేకము, పరేంగిత జ్ఞానము ఎచ్చట యెట్లు విస్తరితములు కాగలవో అట్లయినవి.

# మైరావణుడు

ఈ కథ సవిస్తరముగ పరాశర సంహిత 44వ పటలమునను్నది. మైరావణుడు రావణుని మేనమామ. పాతాళమున దానవరాజ్యాధిపతి. మహా బలవంతుడు, మాయల మారి. పాతాళ లంక ఆతని నివాసము.

రావణుని వధించుటకై వానరసేనతో శ్రీరాముడు లంకలో ప్రవేశించి సైన్యమునువ్యూహముగ నేర్పరచియుంచెను. ఇంతకుముందే శ్రీరాముని పరాక్రమము వినియున్న రావణుడు చింతా క్రాంతుడైయున్న విషయము నెఱిగి మైరావణుడాతనికడకేగి రావణా విచారింపకుము, నా మాయల వలనుండి దాటి రాముడైనను దేవుడైనను ఆవలకు పోలేడు. రామలక్షణుల నిర్వురిని బంధించి రేపే దుర్గకు బలియిచ్చెదము అని ధైర్యము చెప్పివెడలెను.

సుగ్రీవుడు వానరసైన్యాదిపతి రామలక్ష్మణులకు భద్రత కల్పించుట యాతని కర్తవ్యము. ఆ రాజకుమారులను సైన్యమధ్యమున నుంచి హనుమంతుని కావలియుంచి తనపని తాను చూచుకొనుచుండెను. ఆ రాత్రి గడవవలయును మఱునాడు రామరావణ యుద్ధమారంభమగును - హనుమంతుడు తనతోకను పెంచి వలయము నేర్పరచి ఒక ఉన్నత దుర్గమును రామలక్ష్మణుల కొరకై నిర్మించి తానడ్డుగనుండెను.

మైరావణునకిదియంతయు తెలిసినది. సూచీ ముఖుడను రాక్షసుని హనుమంతుడేర్పఱిచిన దుర్గములోనికి బోయి రామ లక్ష్మణుల నొకపెట్టెయందు బంధించి తీసికొనిరమ్మని పంపెను. హనుమంతుని వాలరోమములు తాకినంతనే అతని ముఖము చిల్లులుపడి రక్తసిక్తుడై వెనుదిరిగి తనకీపని అసాధ్యమని సూచీముఖుడు మైరావణునికి చెప్పినాడు. మరల వెంటనే మైరావణుని పంపున పాషాణముఖుడగు రాక్షసుడు వచ్చి తనతలతో వాలదుర్గమును బ్రద్దలు చేయజొచ్చి తన తలయే బ్రద్దలయి వెనుదిరిగినాడు.

సమయము మీరుచున్నది. మైరావణుడు స్వయముగ తానే విభీషణుని వేషమున నేగి హనుమకు నమస్కరించి "ఆంజనేయా! జాగ్రతగ నుండుము సుమా! రాక్షసులు మాయావులు రామలక్ష్మణుల కెట్లో అపాయము

చేయజూచెదరు. నేనొకసారి లోనికేగి రామలక్ష్మణులను చూచి వత్తును'' అనగనే హనుమ వాని మాటలు నమ్మి వానిని లోనికి పోనిచ్చెను. అదే తడవుగా ఆ దానవుడు లోనికి పోయి రామలక్ష్మణులను చిన్న బొమ్మలుగ చేసి పెట్టె యందు బెట్టి చంకను పెట్టుకొని, బయటకు వచ్చి ఏమియు తెలియని వానివలె ''హనుమా! రామలక్ష్మణులు సుఖనిద్రలో నున్నారు. జాగ్రత సుమా'' అని మఱియొకసారి హెచ్చరించి తన పాతాళమునకు పోయెను. రామలక్ష్మణులున్న పెట్టెనొక మూలను దాచి తన సోదరి దుర్దండియను నామెను కాపుంచి రేపు వీరిని గంగా స్నానము చేయించి దుర్గకు బలీయవలెను. జాగ్రత అని ఆమెకు ఆమె పుత్రునకు అప్పజెప్పెను. రామలక్ష్మణులకు పూర్వ రూపములు వచ్చినవి వారెచ్చటనున్నదియు వారే గ్రహింపజాలక ఏ యుపాయముచే బయటకు పోవలయునా అని ఆలోచించుచుండిరి. రామలక్ష్మణుల సుందర రూపమును చూచి అక్కటా యింత మోహనాకారులైన సుకుమారులకా, యీ నిర్బంధము అని దుఃఖించుచు వారి నెట్లైన రక్షించుటకు దుర్దండి ఆలోచించుచుండెను. కాని తానేమియు చేయజాలదు. మైరావణునిచే తానును అచటనే బంధింపబడి యున్నది.

మైరావణుడు డటు వెళ్ళినాడు, ఇటనుండి నిజమైన విభీషణుడు వచ్చి ''హనుమా రామలక్ష్మణులు క్షేమముగా నున్నారు గదా! రమ్ములోనికి పోయి చూతము.'' వారికొక యుద్ధరహస్యము చెప్పవలెను, అనగనే ఆంజనేయుడు విహ్వలుడై ''విభీషణా యిప్పుడే గదా చూచి వచ్చితివి మరల ఈ వచ్చుటేమి నాకంతయు చిత్రముగనున్నదే'' అనగా విభీషణుడును కళవళపడి హనుమా? నేనిచ్చటకు రాలేదు, ఇదియేదో మాయావులలో అగ్రగణ్యుడైన మైరావణుని మాయ కావలయునని చెప్పి త్వరగా హనుమంతుని తీసికొని లోనికేగెను. రామలక్ష్మణులు లేరు.

విభీషణుడు జరిగినదంతయు గ్రహించినాడు ''ఆలస్యమునకు తావు లేదు. మైరావణుని రహస్యములు తానెఱిగినవాడుగాన హనుమంతుని తీసికొని ఆ రాక్షసుని నివాసము జొచ్చితిన్నగా రామలక్ష్మణులు బంధింప బడిన గదియొద్దకు వచ్చి అచట కావలియున్న దుర్ధండికి భయము లేదని చెప్పు నంతలో ఆ సందడి గ్రహించి మైరావణడెదురై తనపైకి వచ్చిన యుపద్రవమును గ్రహించి

భీకరాకృతితో లేచి, వారిపై బడబోయెను. హనుమంతు డంతకంటెను భయంకరాకారుడై ఆతడు కదలుటకు కూడ వీలు లేకుండ తోకతో కట్టిపెట్టి క్రిందపడగొట్టి మైరావణుని ప్రాణములున్న వక్ష స్థలమున పర్వత శిలవంటి తన పిడికిలులతో పొడిచి పాదములతో నలగత్రొక్కి నిశ్చేష్టుని చేసెను. హనుమానుడు వెంటనే రామలక్ష్మణులు బంధింప బడియున్న గదికవాటములు బ్రద్దలుకొట్టి దానవ సైన్యములడ్డు రాకుండ ప్రక్క దారిని ఆ సోదరుల నిరువురిని తన బుజముల యందెక్కించుకొని యథా పూర్వస్థానమున జేర్చి కావలియుడెను. తెల్లవారు సరికి ఈ కథయంతయు సుగ్రీవాదులకు తెలిసి విభ్రాంతులై తమతమ కార్య కలాపములలో పదింతలు జాగ్రత పాటింపసాగిరి.

ఆంజనేయుని బలసాహసములవలన రామలక్ష్మణులు క్షేమముగ నుండిరని వానరసైన్యమంతయు ఆ అంజనాతనయుని వేనోళ్ళ ప్రస్తుతించిరి.

# హనుమత్పురము

## పరాశర సంహిత - 42-43 పటలములు

మేరు పర్వతమునకు దక్షిణమున పదియోజనములు విస్తీర్ణము కల గ్రామమొకటి కలదు. ఆ గ్రామము సర్వవేళల సర్వసంపన్నమై ఆ గ్రామవాసులకెవ్వరికిని ఏ విధముగ లోపములేని రీతిగా విలసిల్లు చుండెను. ఆ గ్రామవాసులు వివిధ వర్ణముల వారు వారి వారి వృత్తులొనర్చుకొనుచు అన్యోన్య శ్రేయోభిలాషులై కలిసిమెలసి మెలగుచు భగవత్ చింతన తోడను భగవత్పూజలతోడను కాలము గడపుచుండిరి. ఆ గ్రామమునకు సంపూర్ణమైన జలసౌకర్యము కలధు. చుట్టు ప్రక్కల వనముల నుండి కూరగాయలు లభించును. కేదారములు సస్య సంపదనిడును. గో వృషభాది పశు సంపద వలన పాడి పంటకు లోటు లేదు. ఆ పురవాసులు ధనధాన్య సమృద్ధితో నుండిరి.

రావణ వధానంతరము అయోధ్యలో శ్రీరామ చంద్రుడు సామ్రాజ్య పట్టాభిషిక్తుడై కోసల రాజ్యము నేలుచుండెను. హనుమంతుడు శ్రీరాముని కొలువు నందుండి నిరంతర రామ సేవాతత్పరుడై యుండెను. సీతా సమేతుడై శ్రీరామునకు మనసులో నేదో తలపునకు వచ్చిన సమయమున హనుమంతుని పిలచెను. ఆ వానర శ్రేష్ఠుడును వచ్చి సీతారాములకు ప్రణామము లొనర్చి నిలచియుండగా శ్రీరాముడతనిని చిరునవ్వుతో జూచి, ఆంజనేయా నీవు నాకు మొదటినుండియు చేసిన యుపకారములను మేము విస్మరింపజాలము. కృతజ్ఞతతో నీకేదియైన వరమీయవలెనని యున్నది కోరుకొమ్మని ప్రసన్నుడై పలికెను. "శ్రీరామచంద్రా నీవు పరమపురుషుడవు. మీ సేవయే నాకు పరమ భాగ్యము". అని ఆంజనేయుడు మిన్నకుండగా శ్రీరాముడు చిరునవ్వు నవ్వుచూ, అట్లు కాదు హనుమా, మేరు గిరికి దక్షిణమున శాంతి సంపదలతో నలరారుచు ఒక చక్కని గ్రామమున్నది. దానికి హనుమత్పురమని నామమిడి నీకు ఇచ్చుచున్నాను స్వీకరింపుము. అచటి జనులెల్లరు హనుమ ద్భక్తులై మనెదరు. నీ పేరు ప్రతిష్ఠలు జగమున చిరకాలము వర్థిల్లగలవు"!! అని శ్రీరాముడు నుడివెను. రామాజ్ఞ ఆంజనేయునికి శిరోధార్యము - మహాభాగ్యమనుకొని అంగీకరించి శ్రీరామునుండి సెలవుగైకొని అచటికేగెను.

ఆంజనేయుడా గ్రామమున కధిపతియే. కాని ఆయనకేమికావలెను, అటనున్న బ్రాహ్మణులను పిలిచి మీరిచట మీమీ కుటుంబములతో సుఖముగా నుండుడు అని దీవించి ఆ గ్రామమును వారికి దానము చేసెను. ఆ బ్రాహ్మణులెల్లరు పవిత్ర వర్తనులు, నీతి నియమము లెఱిగిన దైవ చింతనులు. వారెల్లరు హనుమంతుని ఔదార్యమును మెచ్చి కృతజ్ఞతగ హనుమన్మందిరముల నిర్మించి భక్తితో పూజించుచుండిరి. హనుమత్పురము మఱింత శోభతో సంపదలతో సమృద్ధమై విరాజిల్లుచున్నది.

ఆ పరిసరముల నున్న దుర్ముఖుడను రాక్షసునకు ఆ నగర భాగ్యము చూచి కన్నుగుట్టినది. ఒకనాడకస్మాత్తుగ తనసైన్యముతో వచ్చి, పురవాసుల నెల్లపిలిచి ఈ రాజ్యమునాది. మీరిట నుండుటకు వీలులేదు. తక్షణమే వెడలి పొండని గర్జించెను. ఆ రాక్షసుని బెదిరింపులకు వారెల్లరు భయపడి'' అయ్యా మేమిట ఎంతో కాలము నుండి నివసించుచుంటిమి. హనుమత్పూజ తప్ప మాకు అన్య విషయములతో పనిలేదు. మీకపచారము నేమేమియు చేయలేదు-మమ్ములను వదలుడని వేడిరి. ''వీలు లేదు పో పొండని ఆ దుండగుడు మీదబడుచుండగా ఆ బ్రాహ్మణులందరు మాకొకరెండు దినములు సమయమీయుడు అని వేడుకొనిరి. ఆ రాక్షసుడంగీకరించెను.

ఆ పురవాసులతి భక్తి శ్రద్ధలతో హనుమంతునారాధించుచు మమ్ము రక్షింపుము దేవా! అని ప్రార్థించుచునే ఉండిరి. ఆ రాత్రి ఒక బ్రాహ్మణుని స్వప్నమున ఆంజనేయుడు కనబడి ''ఈ భూమి యెవరిరాజ్యమును కాదు. మాంధాత మొదలైన మహాచక్రవర్తులు వారి సామ్రాజ్యములు తమతో తీసికొని పోయిరా? మీగ్రామమందు మీరుండుడు. ఈ మాట దుర్ముఖునికి నుడువుడు'' అని, దానవసేనయున్న ప్రదేశమందు భీకరాకారముతో చుట్టును తిరిగి పర్వతము పైపునకేగెను. మఱునాడు పురవాసులు దుర్ముఖుని వద్దకేగి ఆంజనేయుని మాటలు తెలియజేయునంతలో రాక్షస సైన్యనాయకుడేగు దెంచి ''స్వామీ! మహనీయుడెవడో తాళప్రమాణమున భయంకరముగ నున్నవాడు మన సైన్యము చుట్టును తిరిగి పర్వతములపైపేగెను. మాకు భయముగానున్నది. ఆతడా బండరాళ్ళను మాపై విసరెనా మేము అంతముకావలసినదే. అని చెప్పిరి.

వారును వీరును చెప్పిన మాటలు దుర్ముఖుని నెత్తికెక్కినవి. కొంత ఆలోచనలో పడి, తాను అకారణముగ గ్రామవాసులను తరిమివేయ జూచితిని అని తనలో తాననుకొని బ్రాహ్మణులవద్దకేగి నమస్కరించి మీరందరును సత్ప్రవర్తనులు మీకేభయయమును లేదు మీ గ్రామమున మీరుండుడని నుడివి వారికి బహుమానములొసగి వెడలెను.

ఇది యంతయు శ్రీ ఆంజనేయుని కృపయే; ఆంజనేయుని పూజించు గ్రామములన్నిటికి ఆ స్వామి కృప యుండగలదను ధైర్యముతో ఆ పురవాసులు తమ పూజను నిర్విఘ్నముగ కొనసాగించిరి.

దేశమున ప్రతి గ్రామమున ఆంజనేయుని విగ్రహములు వెలసినవి మందిరములు నిర్మింపబడినవి. సర్వ రక్షకుడై ఆ స్వామి ప్రజల పూజలందు కొనుచున్నాడు.

# హనుమంతుని ప్రవర్తనము బలసాహసములు

ఇటు తల్లివైపు నుండి, అటు తండ్రివైపు నుండియు దివ్యాంశ సంభూతుడాహనుమానుడు. దానికి తోడు తనకుగల సహజసక్తి వలన మహా విద్వాంసుడు మేధావి, సచ్చరిత్రుడునై విలసిల్లెను. పుట్టుక తోడనే మహా బలుడయి జన్మించినాడు. ఈ సద్గుణముల కన్నిటికి మకుటాయమానముగ విష్ణ్వవ తారమగు శ్రీరామ చంద్రుని సాన్నిధ్యము లభించినది. మేలిమి పసిడికి తీయని తావి అబ్బినట్లు ఆంజనేయుని జీవితము ప్రకాశించినది.

ఒక వ్యక్తి యొక్క గొప్పతనమాతని ప్రవర్తనమువల్లనే లోకులకు విశదమగును. ఆంజనేయుని చరిత్రము స్వచ్ఛకీర్తి విరాజితము - ఎన్ని మార్లు తిరుగవేసి చూచినను ఒక మచ్చయును కానరాదు. అగ్నిపర్వతము కూడ సామాన్య పర్వతమువలెనే కనుపించును కాని, ఒకొక్క సమయమున మహాజ్వాలలు వెలిగ్రక్కి లోకభయంకరమగును. సహజముగ సాధువర్తనుడయ్యు హనుమానుడు సమయానుకూలముగ మహాభీకర రూపమును దాల్చి అనన్య సాధ్యమగు పనులు నెరవేర్చినాడు.

పసితనమందే, బాల భానుడొక పండని భావించి దానిని పట్టి మ్రింగుటకు ఆకసమున కెగిరి, బ్రహ్మేంద్రాదులు మెచ్చిన జగదేక జవసత్వ సంపన్నుడయినాడు. ఇంద్రుని వజ్రాయుధ మాతని హనువు (చెక్కిలి) నకు తాకి వెనుకకు వెడలినది గాని మరేమియు చేయలేక పోయినది. తన శక్తి తానే యెఱుగడు ఎఱిగినను అతిశయ మణుమాత్రమును లేదు. అహంకారమును ఎఱుగనే యెఱుగడు. వేద శాస్త్ర విద్యకు వినయము తోడైన విశిష్టవ్యక్తిత్వమది.

హనుమానుడు తానెంత శక్తిమంతుడైనను అనుచరుడైన మంత్రి గనే వానర వీరుడగు సుగ్రీవుని కొలువుచేరినాడు. అన్నయగు వాలి, తన తమ్ముడగు సుగ్రీవుని బయటకు గెంటి అతని భార్య రుమను కైవశముచేసికొనినాడు. వాలి వలన భయము సుగ్రీవునకు పోలేదు. రావణాపహృతయయిన సీతకై వెదకుచు రామలక్ష్మణులు సుగ్రీవుడున్న పంపా సరోవర ప్రదేశ సమీపమునకు వచ్చినారు. ధనుర్ధారులు మహాతేజస్కులయిన యా వీరులను జూచి తనను చంపుటకు వాలి పంపిన వారేమోనని సుగ్రీవుడు వారిని గూర్చి తెలిసి కొనుటకు మఱెవ్వరిని

పంపలేదు. హనుమంతునే పంపెను. ప్రథమ దర్శనముననే శ్రీరాముడు పరమాత్మస్వరూపుడని హనుమ గ్రహించి ఎంతో వినయముగ వారిని జేరి, వారి రాకకు కారణమెఱిగి సుగ్రీవుడేదైన సాయము తప్పకచేయునని చెప్పి, తన భుజస్కంధముల మీదనే మోసి కొనిపోయి వారిని సుగ్రీవునికడజేర్చినాడు.

రామ సుగ్రీవులకు అగ్ని సాక్షిగా మైత్రి అయినది. రామునితో మైత్రి ద్వారా సుగ్రీవునకు వాలి భయమణగి కిష్కింధారాజ్యము లభించినది. సుగ్రీవుని వలన రామునకు సీతాన్వేషణలో సహాయము వచ్చినది. ఈ మైత్రికి కారకుడు హనుమంతుడే.

శ్రీరాముని జూచిన నిముసము నుండియు ఆ మహనీయునకు తాను దాసుడుగనే ప్రవర్తించినాడు; ప్రవర్తించుటే కాదు ఎన్నియో సార్లు ఆ విషయమును చెప్పి నాడుగూడ ఇది హనుమంతుని వినయమునకు నిదర్శనము. హనుమానుని భుజములపైననే రామాయణకథ నిల్చిన దనుటలో అత్యుక్తి లేదు. అందువలననే "రామాయణ మహామాలారత్నం వందే ఉనిలాత్మజం" అనిన పొగడ్త వచ్చినది.

సుగ్రీవుడు రఘువంశమూలపురుషుడగు సూర్యుని కుమారుడు. ఆ కపివీరుని చరిత రాముడు వినియున్న విషయమే. హనుమను చూచి ఆతని సంభాషణను వినిన రామునకిట్లనిపించినది. "లక్ష్మణా! అంతటి కపి వీరుడు సుగ్రీవునకు మంత్రి అయిన ఈ హనుమ యెంతటి వాడు కావలెను. సకల వేదములెఱిగిన వాడు గాని యితనివలె సంభాషించలేడు. మాటలందొక అపశబ్దమును లేదు.

వానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః!
నాసామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుమ్॥
నూనంవ్యాకరణం కృత్స్నం అనేక బహుధాశ్రుతమ్
బహు వ్యాహరతానేన నకించిదపశబ్దితమ్॥ కిష్కింధ సర్గ

హనుమానుడు రామలక్ష్మణులను సుగ్రీవునకిట్లు పరిచయమొనర్చెను

అయంరామో మహాప్రాజ్ఞః సంప్రాప్తోదృఢ విక్రమః!
లక్ష్మణేన సహభ్రాతారామోయం సత్య విక్రమః
ఇక్ష్వాకూణాం కులేజాతో రామోదశరథాత్మజః!! కిష్కింధ సర్గ 5

హనుమానుడు భవిష్యత్తు ఊహించినాడు. వీరిరువురును వాలి మనపైకి పంపిన వారు కాదు, వారిపనిలో వారుందురు మనకేమిలే అని ఊరకున్నచో తదుపరి కథే లేదు. వారిని సుగ్రీవు నొద్దకు గొంపోయి చేయవలసిన సాయమంతయును చేసినారు.

సీతాన్వేషణమునకును, సముద్రమును లంఘించి, రాక్షసుల లంకలో జానకిని జూచి ఆనవాలుగా తన యంగుళీయక మిచ్చుటకు రామునకు గన్పడిన అర్హుడు హనుమయే. అంగద నాయకత్వమున వానరులందరు సముద్రతీరము చేరినారు సముద్రమును దాటి రక్షోరక్షితమయిన లంకలో ప్రవేశించి సీతను జూచి రావలెను. ఒకరిమొగమొకరు చూచుకొనుచున్నారు. హనుమ తన సామర్థ్యము తానెఱుగడు. ఎఱిగినను అతిశయముతో జబ్బలు చఱచుకొని గంతులువెట్టడు. "హనుమాలెమ్ము యీ పనికి నీవే సమర్థుడవు. మనము వచ్చిన కార్యమును నీవే నిర్వహింపవలెను" అని జాంబవంతుడనువరకు హనుమంతుడు కదలనే లేదు. సముద్ర లంఘనమున కుద్యుక్తుడైనాడు. దేహమును పెంచి ఒడ్డున నున్న మహేంద్ర గిరిపై నిలుచుని పాదములు దట్టించి పైకి లేచుసరికి హనుమంతుని శక్తి కాపర్వతము కదలాడినది. వృక్షములు కూలినవి. అచ్చటివారు నలు ప్రక్కలకు పారిపోయిరి. అతడు ఈ యత్నమున చేసిన మొదటి పని పంచ భూతములను ఇతర దైవతములను స్తుతించుట. తనకు దీవెన లిమ్మని తన తల్లి దండ్రులను, సీతారాములను స్తుతించినాడు. ఎంత వివేకభావుకత ఇది!

ఆకాశపథమున బడి హనుమంతుడు సముద్రమును దాటునపుడు మైనాకుడు అను పర్వతుడు చూచి "హనుమంతా ఒకింత సేపు నావద్ద విశ్రాంతి తీసికొనుమని" ఆహ్వానింపగా హనుమ "మీ యాతిథ్యమునకు కృతజ్ఞుడను. నేపోవునది రామకార్యము. విలంబనము తగదు" అని శరవేగమున వెడలెనేకాని తన శరీర సౌఖ్యమును లెక్కచేయలేదు. ఆద్యంతము హనుమంతుని కర్తవ్య నిర్వహణ భావము, దక్షతయు అట్టివి.

దేవతలు గంధర్వాది ఖేచరులు క్రూరదానవ విధ్వంసమున కవతరించిన రామ చంద్రుని కథా క్రమమునకు సంతోషించినారు. కథ మంచి పట్టులోనికి వచ్చినది. హనుమానుని శక్తిని పరీక్షించుటకు వారు నాగమాత సురసను ప్రేరేపించి

"త్వంముహూర్తం విఘ్నమాచర" అని పంపినారు. ఆమె సూర్య మండల తేజస్వినియై నోరు తెఱచి, నానోటిలోనికిరమ్ము, నిన్ను మ్రింగెదనన్నది. ఈ విచిత్రము గ్రహించిన హనుమ సూక్ష్మ రూపమున ఆమె నోటిలోనికి దుమికి నోరు మూయకముందే క్షణములో బయటకు వచ్చి నీ మాట చెల్లించితిని గదా ఇకనేను పోవలయును. అని యుక్తిగా ఆమె చిక్కు తప్పించుకొనినాడు. అతని యుక్తికి దేవతలు మెచ్చి దీవెనలిడిరి. రామ బాణము వలె సముద్రమును దాటి సాయంతనమగుసరికి లంకాతీరము చేరినాడు.

ఒక కాలిత్రొక్కుతో మహేంద్రగిరి అదరి అణగిపోయినది. దారిలో సముద్రమున అడ్డదగిలిన సింహిక, ఆటలు సాగలేదు ఒక్క ముష్టిఘాతముతో యమసదనమున కరిగినది. లంకాద్వారమునకు అడ్డగ నిలిచిన లంఖిణిని చంపి, నిర్భయముగ కామరూపి అయి ఇతరులకు కనుపడకుండ, లంకలో ప్రవేశించి హనుమానుడు సీతకై వెదకుచున్నాడు ఈ మహాశక్తి సామర్థ్యములు దేవతలకు అద్భుతాశ్చర్యములుగా కన్పట్టినవి.

# లంకానగరమున సీతా దర్శనము

రామ కార్యమున హనుమంతుడింతదనుక చేసిన దంతయు ఒకయెత్తు. లంకలో సాధించినది దానికి పదింతలైన బృహత్కార్యము. తాను దిగినది శత్రుదేశము. అచటి వారు క్రూరులు, మాయల మారులు, నరమాంస భక్షకులు సీతనింకను బ్రతుకనిత్తురా. బ్రతికినను, ఆమె యెట్లుండునో తాను చూడలేదు. రామనామ ధ్యానమగ్నయగు ఒక పవిత్రయోగినీ సదృశమగు జ్యోతిర్మూర్తిని మాత్రము తానూహించుకొనుచు లంకలో వాడవాడలా వెదకుచున్నాడు. ఎచ్చటను కనుపడలేదు. రావణాంతఃపురమున ఆతని భార్య మండోదరిని చూచి సీత అనుకొనెను. మరల వెంటనే జానకి ఇచ్చట నుండుట అసంభవము ఆమె సీత కాదు అనితోచినది. సీత జాడ కనుగొనకుండ తాను వెనుకకు వెళ్ళలేడు, వెళ్ళడు కూడ.

లంకను నాలుగు మూలల వెదకినాడు. పిల్లియో పిపీలికయో అయి వాడవాడల, ఇల్లిల్లును వెదకినాడు. ఆహర్మ్యములు, ఆ విహారప్రదేశములు! లంకాపట్టణము దేవేంద్రుని అమరావతి పట్టణమును మించిన సుందర నగరము ఈ సౌందర్యమంతయు రావణాది రాక్షసుల కామ వాంఛాతృప్తి కొరకేనని హనుమ కాశ్చర్యమైనది. రావణుని సౌధ సముదాయ మందున్న స్త్రీలనందరిని సీత అందున్న దేమోనని చూచినాడు. పరస్త్రీని కన్నెత్తి పరికించని జితేంద్రియు డాహనుమానుడు. తన కట్టి తలపులేదు, తాను చూచినది సీతాన్వేషణకొరకేనని తనలో తానే సంతృప్తి పడినాడు. స్త్రీలను స్త్రీల మధ్యలోనే కదా వెదుకవలెను.

"నా అన్యత్ర హి మయాశక్యా వైదేహీపరిమార్గితుం!
స్త్రియోహిస్త్రీషుదృశ్యంతే సదాసంపరిమార్గిణే॥

ఈ యన్వేషణమొక మహాసాధనము. ఎందులకు? ఒక కామాంధ పిశాచ దుష్కృత్యమువలన విడిపోయిన ప్రకృత్యంశ పరమాత్మలగు సీతా రాముల కలయిక కొరకే.

ఎట్టకేలకు హనుమ పురబహిః ప్రదేశమున నున్న అశోకవనమున కూడ వెదకుచు ఒక చెట్టు క్రింద రాక్షస స్త్రీల తర్జన భర్జనల మధ్య రామధ్యానములో అశ్రుసిక్తాననయై ఉన్న అబలను జూచి ఆమె యే సీతయని ధ్రువపరచుకొని,

ఒకనిముసమాలోచించుకొనెను. తాను వచ్చిన కార్యము నెట్టులామెకు తెలుపవలెను, ఏ భాషలో మాటలాడ వలెను, ఎప్పుడు మాట్లాడవలెను ఇవన్నియు హనుమంతునకు సమస్యలే. ఈ లోపున బహుపటాటోపముతో రావణుడేగుదెంచి నానా దుర్భాషలాడుచు సీతా! నన్ను అంగీకరింపుము, నేను త్రిలోకాధిపతిని. నా దానివి అగుచో త్రిలోక భాగ్యములు నీకు కల్పించెదను. లేదా రెండు మాసములలో నిన్ను నరికి ముక్కలు చేయించెదను" అని బెదిరించి యేగెను. సీత తానేమి చేయగలదు. పులులకు చిక్కిన లేడివలె దుఃఖించుచుండెను. ఇదంతయు హనుమంతుడు చెట్టుపైనుండి చూచుచునే యుండెను. ఒక మహా సాధ్వియగు, లక్ష్మీ స్వరూపముపై ఒక నీచ రాక్షసుడిట్లు ప్రేలునా? హనుమంతునకు ఒడలు మండినది. అచ్చటనే రావణుని పైకురికి మట్టుపెట్టదలచెను కాని, రామునానుజ్ఞలేక ఓరిమి పట్టినాడు. రావణుడేగినాడు. కావలియున్న రాక్షస వనితలు నిద్ర మత్తులో నున్నారు.

ఇది మంచి సమయమని తలచి, ఆలోచించి ఆలోచించి చెట్టుపై నుండియే మానవ భాషలో రఘువంశమును కీర్తించుచు మెల్లగా దిగివచ్చి హనుమానుడు శిరమువాల్చి సీతకు నమస్కరించి, తనపేరు చెప్పి తాను రాముని దూతనని నుడివి రామలక్ష్మణుల క్షేమమును దెల్పి సీతకు ప్రణతులర్పించెను. ఒక వానరుడు ఆకస్మికముగా చెట్టు నుండి దిగి, తల్లీ నేను రామదూతను అని ఏవేవో మాటలు చెప్పగనే సీతనమ్మునా; ఒకసారి మోసపోయినది. హనుమంతుని మాటలు జానకి నమ్మలేదు. కోతి సముద్రమును దాటుటెట్లు, శ్రీరాముడు దూతను పంపించునెడల కోతియే కావలెనా, వీడెవడో మరల మాయల మారి రక్కసియని సీత ఆతని వంకకే చూడలేదు.

హనుమంతుడంతట జానకిని జూచి "అమ్మా, ఇదిగో నా ప్రభువంపిన ఆనవాలు నీయెడబాటు రామునికెంతో కలత కల్గించినది. నిన్నే తలచుచు అన్నమైన ముట్టడు. నిద్రలేనేలేదు. కపిరాజు సుగ్రీవునితో చెలిమి చేసి వానరసేనతో రావణుని అంతమొందించుటకు రానున్నాడు. హనుమంతుని ఈ మాటలు సీతకు కొంత నమ్మకము కలిగించినవి. రాముని అంగుళీయకము తనకు గురుతే. తన వివాహ సమయమున తన తండ్రి జనకుడు శ్రీరాముని కిచ్చిన కాన్క అది. ఏవేవో

మధురస్మృతులొక్కమారుగ మనసున కదిలినవి. ఆ అంగుళీయమును గ్రహించి కనుల కద్దుకొని జానకి "ఓయీ వానర వర్యా! నీ మాటలు సరియే, వానరసేన వార్ధిని దాటుటెట్లు, రావణుని గడువులోపల శ్రీరామ చంద్రుడు లంకను జేరి ఈ దానవుని వధించి నన్ను తీసికొని పోగలడా" అని సందియములు నుడువగానే హనుమంతుడు "అమ్మా నీకిక భయమక్కరలేదు. సుగ్రీవుని సేవలో పర్వతములు బ్రద్దలుచేసి తీసికొని రాగల మహాబలులున్నారు. ఏ ఊళ్ళతోనో సాగరమును బంధించి వారధి నిర్మించి, లంకను చేరగలరు. శ్రీరామచంద్రుడు వీరనారాయణుడు. ధనువు సారించి నిలిచెనా వారిముందు లోకములాగవు. లక్ష్మణ స్వామియు అంతటి వాడే. ఇంకను సమయము మించి ఆవశ్యకమైనచో ఈ లంకనంతయు నేనే పెళ్ళగించి శ్రీరాముని ముందుపెట్టెదను. రావణుని మాటలకు భయపడకుము అతని అంతము సమీపించినది" అని ఆకసమంత ఎత్తున భీకరాకారుడై దేహమును పెంచి తన శక్తి చూపినాడు. సీతకు మొగము విచ్చినది; హనుమంతుని శక్తి సామర్థ్యములకు అబ్బురపడినది. హనుమా! నేను మరల శ్రీరామ చంద్రుని చూడగల్గుటకు "త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణమ్" సమర్థం ప్రాజ్ఞత్వం నీవు సమర్థుడవు ప్రజ్ఞా శాలివి. నీవే నయ్యా, సహాయము చేయగలవు అని నుడివి తనచూడామణిని శ్రీరాముని కానవాలుగనిచ్చి దీవించి పంపినది.

ఈ సీతా దర్శన ఘట్టము యావత్తు హనుమంతుని కార్యనిర్వహణదక్షత, వాక్చమత్కృతి, నిశితమైన బుద్ధి, నిశ్చయముగల వివేకమునకు తార్కాణము. ఇక లంకలో హనుమంతుని ఇతర కార్యములును ఇంతటివే.

# రావణుని కొలువు - లంకా దహనము

జానకి నుండి మరల హనుమానుడు తిరుగు ప్రయాణమైనాడు. సీతను జూచిన ఆనందాతిరేకములో అశోకవన వృక్షములను, తోరణ స్తంభములను విరిచి ప్రోగులు బెట్టి అడ్డుదగిలిన కాపలి వాండ్రను తరిమి కొట్టినాడు. ఆంజనేయుని ఆగడములు ఊరెల్ల ప్రాకినవి. తన మీదకు వచ్చిన సైనికులు యోధులు మంత్రికుమారులు సేనా నాయకులు హనుమానుని ధాటికి సగము చచ్చిరి సగము పరువులెత్తిరి. రావణుని గుండెలు గుండెలలో లేవు. తనకుమారుడు మహాబలుడు అక్షయుని బంపినాడు. అతడును హనుమంతుని చేతులలో మరణించినాడు. తుదకు మాయలమారి ఇంద్రజిత్తునే పంపినాడు. హనుమానుని బలము ఇంద్రజిత్తు గ్రహించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాడు. హనుమానుడు బ్రహ్మాస్త్రమును గౌరవించి, లొంగినట్లు నటింపగా అతనిని త్రాళులతో కట్టి రావణుని కొలువున కీడ్చినారు. రావణుని సభా భవనము దేవేంద్రుని సభావైభవమును మించి యున్నది. హనుమను చూచిన రావణునికి మహాగ్రహము కలిగినది. ఇతడా ఇంతచేసినవాడు. ఇతడు ఇంద్రుడో బాణుడో మరేదియో అని రావణుని కొక భీతికలిగినది. హనుమంతుడు రావణుని జూచి నేనెవడను కాదు "నేను వాయుపుత్రుడను. రామదూతను. సీతను జూచివచ్చితిని. నిన్ను తోకతో జుట్టి చతుస్సముద్రముల ముంచిన వాలి తమ్ముడు సుగ్రీవుని మంత్రిని. అని రావణుని సందియమునకు హనుమ సమాధానమిచ్చినాడు.

"దాసో உహం కోస లేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః" శ్లో - 3-4

తానెంత వాడయినను శ్రీరాముని మాట వచ్చుసరికి తాను శ్రీరామునికి దాసుడననియే చెప్పుకొనినాడు హనుమానుని లోని విశిష్టత ఇది.

రావణుడు త్రిలోక విజేత. దానవరాజ్య సార్వభౌముడు. హనుమానుడంతకు మించినవాడు. ధిక్కరించి యిట్లు మాట్లాడినాడు. "రావణా నేనెవరినో చెప్పితిని. ఇకనే వచించు మాటలను వినుము. నీకున్న ఈ వైభవమెల్ల పరకాంతల నపహరించి బాధించుటకా, మహనీయుడగు శ్రీరాముని భార్య నపహరించి మహాపాపము చేసినావు. వెంటనే బుద్ధి తెచ్చుకొని ఆ మహాత్ముని

పాదములపైబడి శరణువేడి సీతనర్పించుము. శ్రీరాముడు కరుణాళుడు నిన్ను క్షమించును; లేదా సుగ్రీవ జాంబవదాది వానరసేనతో సముద్రమును దాటి లంకను చుట్టుముట్టి నిన్ను సపరివారముగా ధ్వంసము చేయును'' తననిండుకొలువులో తన మంత్రి సామంతులముందు, ఎవడీతడిట్లు ధిక్కరించును, రావణుని కొడలుమండినది. ఈ కోతిని చంపుడని సైనికులకాజ్ఞ యిచ్చినాడు. రావణుని తమ్ముడు విభీషణుడు, అడ్డుపడి, దూతయైవచ్చిన వానిని చంపరాదు. అతని ప్రవర్తన మంచిదికానిచో శిక్షింపుమనెను. రాక్షసేంద్రుని కోపము కొంత తగ్గినది. ఈ కోతి తోకకు నిప్పుముట్టించి ఈడ్చి పారవేయుడని మరల ఆజ్ఞ. విన్నదే తడవు సైనికులు వచ్చి హనుమ తోకకు గుడ్డలు చుట్టినారు, తైలముతో తడిపి మండుచున్న కొరవితో నిప్పు ముట్టించినారు. బయటకీడ్చి వదలినారు.

హనుమంతునకు స్వేచ్ఛలభించినది. పైకెగసి నింగినుండి లంకా నగరమంతయు చూచినాడు. ఎచటికేగునో ఏమి చేయునో దృష్టికి గోచరింపదు. మహా వేగమున అవార్య ఆగ్నేయాస్త్రమువలె విహరించి వాడవాడల నిప్పంటించినాడు. రావణుని కనులముందు అమరావతిని మించు తన లంకామహా నగరము ఒక కోతివలన సర్వముధ్వంసమైనది. ఇక శ్రీరాముడేతెంచి ఏ విపత్తు తెచ్చునో. రావణుడు చీమ చిటుకన్నను భయముతో వణకిపోవుచున్నాడు. హనుమంతునకొక పెద్ద సందేహమే వచ్చినది. లంకలో అంతయు మంటలు లేచినవి. తన క్రోధమువలన గదా అందమైన లంక దగ్ధమైనది. ఎవరికెట్టి బాధ కలిగినదో అని హనుమ చింతించెను ఎంతవిశాల హృదయుడు కాకపోయిన శత్రువులయిన వారిని గూర్చి అట్లు భావించగలడు. అయ్యో జానకి ఏమైనదోనని. వినతుడై వెళ్ళి చూచినాడు అగ్ని హోత్రుడామె సమీపమునకే చేరకుండుట గమనించి అగ్ని దేవునకు కృతజ్ఞతలతో నమస్సులర్పించినాడు.

సంతోషముతో వెనుదిరిగి సముద్ర జలములందు తోకనార్పి ఆవలిగట్టు జేరి అంగదాది వానరులను కలిసి కిష్కింధ జేరి శ్రీరాముని ముందు వ్రాలినాడు వ్రాలుటే ఆలస్యము ''చూచాను సీతను''.

''దృష్టా మయాసీతా.... రాక్షసీమధ్యే ..... చింతాపరాయణా''

అని ఒక్కమాటలో చెప్పినాడు. ఎంత వివేకం! హనుమానుని తిరుగు రాకకై

వేయికన్నులతో చూచుచు క్షణము యుగాలుగా గడపు రామ చంద్రునకు తాను రాముని ముందు ప్రణమిల్లుచూ తన దౌత్యసారాంశం ఈ ఒక్కమాటలో చెప్పిన హనుమ మేధాశక్తి అద్వితీయము ఊహాతీతము.

హనుమంతుడు తానులంకలో కనినది, వినినది, చేసినది; లంకా దుర్గముయొక్క రహస్యమార్గములు తాను చూచినవి గ్రహించినవి సర్వము శ్రీరామునకు విశదముగా నుడివి ఆ ప్రభువు తనను ఎందులకు దూతగా పంపినాడో అంతకన్న పదిరెట్లు నేర్పుతో తనపనిని ఆ కపివీరుడు నెరవేర్చి వచ్చినాడు. శ్రీరామచంద్రునికి కనులు చెమ్మగిల్లినవి. వికసిత వదనుడై ఆంజనేయుని మనసార కౌగిలించుకొని యిట్లనినాడు.

ఏషసర్వ భూతస్తు పరిష్వంగో హనూమతః!
మయాకాలమియం ప్రాప్య దత్తస్తస్య హనూమతః!!

ఇది యెంతటి మాట శ్రీరాముని రూపములో నున్న పరమాత్మయే "హనుమా నీవు పురుషోత్తముడవే. నీవు చేసిన మహోపకృతికి ఈ పరిష్వంగములో నన్ను నీకు సమర్పించుకొనుచుంటిని. "అని గౌరవించినాడు ఆ యిరువురి అన్యోన్య పరిష్వంగములో హరిహరాత్మకమైన తేజస్సు ఒకే కాంతిగా వెలిగిన దచట. మఱొకమాట కూడ రాముడనినాడు.

ఏకైక స్యోపకారస్య ప్రాణాన్ దాస్యామి తేకపే।
శేషస్యా హోప కారాణాం భవామ ఋణి నోవయమ్॥

"హనుమా! సీతా సందర్శన వార్త దెచ్చిన ఒక్క ఉపకారమునకే నా ప్రాణము సర్వస్వమునిచ్చినను సరిపోదు. తక్కిన నీ ఉపకారములకు శాశ్వతముగా నేను నీకు ఋణపడి ఉండవలసిన వాడినే" శ్రీరామునంతటి వానిచే యిట్లు ప్రశంసింపబడిన హనుమంతుడు ఎంతటి వాడు కావలెను.

ఆంజనేయుడు శిరము వంచి వినయముగ ఇట్లనినాడు. "స్వామీ నేను చేసిన పనిచాల స్వల్పమైనది. లంకను నుగ్గు నుగ్గు చేసితినా! రావణుని వధించి ఆ దుష్టుని తలలు నీముందు పెట్టితినా! ఏమీ ఘనకార్యము చేయలేదే కేవలము వార్తా హరునిగా వెళ్ళి వచ్చితిని. దానికే నీ కౌగిలి పొందునంతటి బహూకృతికి నేను తగను. అని తన వినయ స్వభావమే చూపినాడు. ఉత్తమ పురుషుని లక్షణమిది.

# రామరావణ మహా సంగ్రామము

హనుమానుని శక్తి ప్రదర్శనము రామకథ కంతకును మకుటాయమానమైన ఘట్టము రామ రావణ మహా సంగ్రామము. సీతాన్వేషణ కార్యమున ఒక్క ఊపులో సముద్రమును లంఘించినాడు. లంకలో అశోకవనమున సీతాదేవిని చూచి శ్రీరాముని కుశలవార్త జెప్పి సీతా వార్తను రామునకు తెలిపినాడు, తన ప్రయత్నములకు దారిలో తనకడ్డు వచ్చిన వారిని మట్టుపెట్టి లంకాధి పతి రావణుని ధిక్కరించి లంకను గాల్చి వచ్చినాడు. ఇక శ్రీరాముడు వానర సేనను తీసికొని లంకను జేరి రావణుని వధించి సీతను తీసికొనువచ్చు రంగము సిద్ధమైనది. ఈ కార్యక్రమమంతయూ హనుమంతుని వలననే నెరవేరినది.

వారిధికి వారథి కట్టి శ్రీరాముడు వానరసేనతో లంకలో బ్రవేశించి రావణునిపైకి యుద్ధసన్నద్ధుడయ్యెను. లోకములు కనివిని యెఱుగని మహాసంగ్రామమది. ఒకప్రక్క ధర్మసంస్థాపనాచార్యుడు దుష్ట శిక్షకుడైన శ్రీరాముడు; మరొక ప్రక్క త్రిలోక కంటకుడు మహాపాపి అయిన రాక్షసేంద్రుడు రావణుడు.

యుద్ధ మారంభమైనది. మాయల మారి రావణుడు ప్రథమ దినమునందు ప్రయోగించిన మహాశక్తికి వానరసేనలేకాదు రామలక్ష్మణులు స్పృహదప్పి యుద్ధరంగమున పడిపోయిరి. ఆనాడు హనుమ లేనిచో ఏమయ్యెడిదో - సుషేణుని సలహాపై హిమగిరి కేగి తెల్లవారకుండ సంజీవని ఓషధిని దెచ్చి అందఱికిని చైతన్య శక్తినిచ్చిన మహనీయుడు హనుమానుడు. రావణుని శక్తి ప్రభావమున ఎల్లరును నిశ్చేష్టులై యున్న సమయమున జాంబవంతుడు కొంత ఓపిక చేసికొని, ప్రక్కనున్న వారితో "చూడుడు ఆంజనేయుడెచట నున్నాడో, ఆతడు బ్రతికి యున్నచో అందును బ్రతికి యున్నట్లే" అనినాడు హనుమంతుని శక్తికి ఎంతటి ప్రశంస! ఆంజనేయుడు తన బలసత్వములు నిరూపించుకొనినాడు. మఱునాటి యుద్ధమున ఇంద్రజిత్తు ఏమేఘముల చాటునుండియో ప్రయోగించిన శక్తి ప్రభావమున లక్ష్మణుడు మూర్ఛ నందినాడు. సోదరుని దురవస్థకు శ్రీరాముని దుఃఖమాగలేదు. కన్నీరు మున్నీరైనది. ఎవరు దిక్కు. హనుమానుడే మహావేగమున నేగి రాత్రికి రాత్రి సంజీవని ఓషధిని రాతిపెళ్ళతో సహా తెచ్చి, స్పృహలేకపడియున్న లక్ష్మణుని, మృతులయిన వానరులను బ్రతికించి శ్రీరామునికి హర్షము కల్గించెను. రావణుని శక్తి యుక్తులను, ఇంద్రజిత్తు మాయలను నిస్సారములు చేయగల్గిన

ఘనత హనుమంతునికే దక్కినది. బాల్యము నుండియు హనుమానుడు చేసిన సాహసకృత్యములు అనన్యసాధ్యములు, చూపిన బలప్రదర్శన అసదృశము, ప్రదర్శించిన శక్తియుక్తులు అసాధారణములు. ఇది అంతయు విష్ణ్వంశ సంభూతుడైన శ్రీరామునికి తోడైన పారమేశ్వర హనుమత్ శక్తి.

యుద్ధమంతమైనది. శ్రీరాముని విజయ వార్త చెప్పి అశోకవనము నున్న సీతను తీసికొనివచ్చుటకు, విభీషణునితో హనుమంతుడే వెళ్ళినాడు. వారు తిరిగి అయోధ్య చేరుకున్న వార్త హనుమంతుడే పోయి భరతునకు చెప్పినాడు. అన్నిటికిని ముందు హనుమంతుడే కావలెను.

# శ్రీరాముని పట్టాభిషేకము

రావణుడు సపరివారముగా వధింపబడినాడు. శ్రీరాముని శరణు బొందిన విభీషణుడు లంకకు రాజైనాడు. అగ్ని పరీక్షసంపూర్ణమై సీత శ్రీరాముని కలిసినది. పుష్పకవిమానమున సీతారాములు ప్రధానాసన స్థితులై తక్కువానర వీరులును ఆసీనులైన విమానము అయోధ్య దరి దాపుల నున్నదనగా శ్రీరాముని ఆదేశమున హనుమంతుడు పరువుననేగి సీతారాముల రాకను భరతునకు తెలిపెను. అయోధ్యా పౌరులెల్లరు భరతునిముందిడుకొని మంగళవాద్యములు మహారాజోచిత గౌరవములతో సీతారాములను నగరముకు దోడ్కొని యేగిరి. మఱునాడే కులగురువు వశిష్ఠుని ఆధ్వర్యమున సీతాసహితుడై శ్రీరాముడు కోసల సామ్రాజ్య పట్టాభిషిక్తుడయ్యెను.

శ్రీరామ చంద్రుని సామ్రాజ్య పట్టాభిషేకసభా మందిరము. ముని వర్యులతో అమాత్య సుగ్రీవాది వానరులతో విభీషణ జాంబవంతులతో సకల సామంత రాజన్యులతో తక్కు పరివార, పురప్రముఖులతో మహా వైభవముగ విరాజిల్లుచున్నది. ఎవరెచ్చట ఆసీనులైనను హనుమంతుడు ప్రధాన ఆసనమునకు అర్హుడయిన వాడే. అట్లని మునుముందునకాతడు తోసుకుని రాలేదు. ఒక ప్రక్కగానే ఉండెను. సీతారాముల దృష్టి హనుమంతుని మీదనే, హనుమంతుని నేత్రములు సీతారాముల పాద పీఠములందే ఉన్నవి.

హనుమంతుని అనన్య సాధ్యమైన సాహసకృత్యములకు సత్ఫలోదయమైన అమృతక్షణమది. లోకమున ధర్మ సంస్థాపన కొఱకుదయించిన శ్రీహరి అవతారము శ్రీరాముడు - భావి శ్రీరామ రాజ్య దివ్యదృశ్యము హనుమంతుని భావములో, కనులలో మెఱసిపోవుచున్నది. తాను నిరీక్షించు చున్న పవిత్ర సమయము ఈనాడు కనులముందున్నది. సభాంతమున హనుమంతుడు లేచి వసిష్ఠుల అనుమతితో సీతారాములను వినమ్రుడై స్తుతించి తన కృతజ్ఞతలనిట్లు వెల్లడించెను.

శ్రీ సీతారామప్రభూ! పరమాత్మ రూపా! వానర విభుడగు సుగ్రీవుడు మొదలు నావరకు తమ అనుచరులముగా సేవకులముగా మా జనసమ్ములు ధన్యమ్ములైనవి. రావణాది క్రూర రాక్షసుల వధ కారణముగా జగత్తున ధర్మ రక్షణ

కార్యమున మాకు కూడ సేవచేయుటకు అవకాశము కల్గించిన మీ యనుగ్రహమునకు కృతజ్ఞులము. లక్ష్మీ స్వరూపయైన సీతతో తామందిన అయోధ్యా సామ్రాజ్య పట్టాభిషేకము నిజముగ లోక కళ్యాణ ప్రదమగు మహోత్సవము. మీ దర్శన భాగ్యమున, మీ సాన్నిధ్య లాభమున మా జన్మలు తరించినవి. మా హృదయపూర్వక భక్త్యంజలులు గైకొని మమ్ము దీవింపుడు. అనిన హనుమంతుని వినయ ప్రవర్తనకు సభాస్తారు లెల్లరు హర్ష పులకితులైరి.

ఏ మహాప్రభువు రాజ్యపాలనము చూడవలయునని మునులు దేవతలు ప్రజలు కోరుకొనిరో, దానవ దౌష్ట్య నిర్మూలనమునకై వచ్చిన ఏ అవతారమూర్తికి శివశక్తి రూపమగు హనుమానుడు తోడైనిలచెనో, ఆ శ్రీరాముడు లోకపాలకుడై విరాజిల్లెను. త్రిలోకములు శాంతి సౌఖ్యధామములయ్యెను.

హనుమంతుని బలసాహసములు శక్తి సామర్థ్యములు సర్వజగద్విదితములైనవి. శ్రీరాముని రూపమున శ్రీవిష్ణువు మానవుడై వచ్చి, ఆదర్శమానవుడు ఆదర్శ నృపతిగా కీర్తినందెను. వానరరూపమున వచ్చిన శివశక్తి హనుమానుడు అనితర సాధ్యమైన బలసాహసములు ప్రదర్శించి మహా విద్వాంసుడై, చిరజీవిగా వరములంది చరితార్థుడయ్యెను. శ్రీరామపట్టాభిషేకమునకు వచ్చిన వారెల్లరు హనుమానుని శక్తి సామర్థ్యములు వేనోళ్ళ కొనియాడిరి. ఇంత విఖ్యాతి నందిన వాడయ్యు హనుమంతుని అభిలాషవేరు.

శ్రీరాముని పట్టాభిషేకము త్రిలోక క్షేమంకరము. పట్టాభిషేక సమయమునకు దేవేంద్రుడు శుభ సూచకముగ ఒకమణిహారము శ్రీరామునకు కానుకగా బంపెను. శ్రీరాముడా హారమును సీతకీయగా సీత దానిని ఆంజనేయునికి బహూకరించెను. సీతారాములకు ఆంజనేయుడనగా ఎంతకృతజ్ఞత.!

# హనుమంతుని ఆధ్యాత్మిక చింతనము

హనుమానుడు సీతారాములను తల్లి దండ్రులకన్న మిన్నగనే భావించినాడు. ఎవరికైనను మొదటి గురువులు తల్లి దండ్రులే. సీతారాములా మహా కపికి జగన్మాతాపితలు. శ్రీరాముడు పరబ్రహ్మము సీతమూల ప్రకృతి. శ్రీరామ తత్త్వ స్వరూపమును శ్రీరామునను మతిచే సీత హనుమానునకు బోధించెను. ఈ వృత్తాంతము శ్రీ సీతారామాంజనేయ సంవాదము ను పూర్వగ్రంథమున నున్నది. ఇది బ్రహ్మాండ పురాణాంతర్గతమగు అధ్యాత్మరామాయణమునందలి శ్రీరామ హృదయమని ఆ గ్రంథముననున్నది. పార్వతి ఒక సమయమున శంకరుని జేరి "దేవదేవా! పాపముల నశింపజేసి ఇహ పర సుఖములను బ్రహ్మానంద సుఖమును ఇచ్చి పరబ్రహ్మసాక్షాత్కారము కల్గించి ఉపాసకులనుద్ధరించు మంత్ర రాజమును వినగోరెద" ననగా సీత హనుమంతునికి బోధించినరామమంత్ర మహిమను రామతత్త్వమును శంకరుడే ఇట్లు నుడివినట్టు కలదు.

రామనామ మంత్రము సకల మంత్రములలో ఉత్తమమ్మైనది. సకల యోగులు బ్రహ్మాది జ్ఞానులు సర్వవేళల పరబ్రహ్మభావమున క్రీడించు చుందురు గాన పరమాత్మకు రామనామము కలిగినది. జీవ బ్రహ్మములకు అద్వైత స్థితిని సీత విశదీకరించెను. ఆంజనేయుడెన్నియో ప్రశ్నలను మధ్యమధ్య వేయుచు తన సందేహములను తీర్చుకొనుచుండెను. జీవునకు బ్రహ్మానందసుఖమును గల్గించు తారకయోగమను యోగమును, పరబ్రహ్మస్వరూపము జీవ బ్రహ్మైక్య విచారము చిద్రూపలక్షణములు గల సాంఖ్యయోగ విశేషములను సీతవచింపగా, వైరాగ్య లక్షణములు యోగిలక్షణములు జీవన్ముక్తుని స్వభావమును వివరించు అమనస్కయోగమును శ్రీరాముడు బోధించెను. ఏది యెట్లున్నను తాను సర్వ శాస్త్ర వేదియయ్యు అధ్యాత్మయోగమును మరల సీతారాముల వద్ద నేర్చిన మహా యోగి హనుమానుడు. సీతారాములు బోధించిన విషయములను చిత్తశుద్ధితో గ్రహించి దేహాత్మాభిమాన జీవాత్మాభిమానదశలను దాటి పరబ్రహ్మమునకును తనకును భేదములేని కూటస్థుడే తాను అను బ్రహ్మానందాను భూతి గలిగిన వాడయ్యెను.

చిరజీవి సకల విద్యావిశారదుడు పరమ యోగి శ్రీ ఆంజనేయుడు సీతారాముల నుండి సెలవు గైకొని గంధమాదవ గిరినున్న నిజాశ్రమమున కరిగి సంతతాత్మ ధ్యానపరాయణుడు భక్తరక్షకుడునై నేటికిని అందు విరాజిల్లుచున్నాడు.

## భవిష్యద్బ్రహ్మ - ఆంజనేయుడు

### పరాశర సంహిత - 54వ పటలము

ఆంజనేయుని మహిమ ఊరూర వాడవాడల దేశమునందు వ్యాపించినది. ప్రజలా మహనీయుని విలాసములు లీలలు కథలు కథలుగా చెప్పుకొని పూజ లాచరించుచున్నారు. కరుణా తరంగిత హృదయాంతరంగుడా మహనీయుడు. భక్తుల కెచ్చట ఏ బాధ కలిగినను తాను ప్రక్కనుండి కాపాడుచునే ఉండును. హనుమంతుడు నివాసమున్న గంధమాదనాశ్రమము వేదోపనిషద్ధర్మ మార్గ ప్రచారస్థానమైనది.

ఒకనాడా హనుమంతుడు, సాకేతమున జానకీ సహితుడైయున్న శ్రీరామ చంద్రుని చూడదలచి తన వాహనమగు ఒంటెనెక్కి వెడలి, ఒకింత దూరమున వాహనముదిగి, తన స్వామి వారిని తలచుకొనుచు పోయి వారి పాదముల ప్రణమిల్లి, ఉపనిషత్సార స్తోత్రములు పఠించి సీతా రాములను దర్శించిన ఆనందాతి రేకమున హర్ష బాష్ప సిక్తవదనుడై వారిముందు నిలబడెను. శ్రీరాముడా హనుమానుని సుఖాసనాసీనునిగా జేసి హనుమా నీరాక మాకెంతో సంతోషము నిచ్చినది. నీవు గంధ మాదనగిరికేగిన తరువాత మరల నిన్ను చూచుట యిదే. నీరాక సీతకు గూడ ఎంతయో ఆనంద ప్రదము, నీవున్న పరిస్థితులు నీవు సంచరించు చోట్లు శుభముగానున్నవి, కదా! అని కుశల ప్రశ్నచేసి "ఆంజనేయా నీవు మఱియొక కార్యము నెరవేర్చవలయును. నా అంగుళీయకమును సత్యలోకమున నుంచుటకు బ్రహ్మ అడుగగా ఇచ్చితిని. లంకయందు వియోగ దుఃఖ సమయమున ఆ ముద్రికయే సీతకు మనశ్శాంతి కల్పించుచుండినది." ఇప్పుడది కావలెను. నీవు వేగముగ పోయి తెమ్ము. అని కోరిన శ్రీరాముని పలుకులే తడవుగా హనుమంతుడు మహావేగమున సత్య లోకమున జేరెను.

అచట బ్రహ్మదేవుని సభ నిండుగా నున్నది. సనకసనంద నాది మహా మునులు, దిక్పాలురును అందే ఉన్నారు. ఆంజనేయుని చూచుసరికి వారందరును లేచి నమస్సులాచరించి ఉపవిష్టుని జేసి కుశలమడిగిరి. ఆ మరుత్తనయుడంత బ్రహ్మదేవుని దిక్కుమొగమై "దేవా! మీకు నా నమస్కారములు శ్రీరామ చంద్రులు కనకరత్న ఖచితమైన తమ అంగుళీయకము

మీకిచ్చినారట దానిని తీసికొని రమ్మని నన్ను పంపినారు. ఈ ముద్రిక కొరకు స్వామి సాకేతమున వేచి యున్నారు. నేనిది తీసికొని వేగమే వారికంద జేయవలెను'' అని చెప్పిన మాటలును విని బ్రహ్మ ''ఈ ముద్రికను శ్రీరామ చంద్రులు సత్యలోకమునకిచ్చిరి తిరిగి ఇచ్చుటకు వీలు పడదని'' నుడువగానే ఆంజనేయునికి కోపమువచ్చి దేవా మీరు కృతజ్ఞతతో మాటలాడుట లేదు. నాకిచట ఆలస్యమొనర్చుటకు వీలుండదు. మీరు వెంటనే ఈయకపోయినచో నేనీ ప్రదేశమంతయు పెళ్ళగించి తీసికొని పోయి రాముని ముందు పెట్టెదనని దేహమును భీకరముగ పెంచి పెద్ద సింహనాదము చేసెను. విశ్వతోముఖమైన ఆ యాకారము జూచి సత్యలోక మంతయు గగ్గోలు పడినది. చతుర్ముఖుడు ఏమీ యీ విపరీతము ఎవరిట్లు చేసిరని విభ్రాంతిని మునుగగా ప్రక్కనున్న సనకమహర్షి దేవా యిది శ్రీరాముని ఉంగరమునకై వచ్చిన మహావీరుడు ఆంజనేయుని బల విజృంభణము. పరిస్థితులు మేర మీరకముందే మీరా యుంగరము నిచ్చి ఆంజనేయుని పంపవలసినదని నుడివిరి, బ్రహ్మ ఆంజనేయుని స్తుతించి ప్రక్కనున్న తామర పూకొలను చూపి అంగుళీయకము అందున్నది తీసికొనుమనెను. ఆ కొలను స్వర్ణకమలములతో బహుసుందరముగానున్నది. ఆ పూవుల మధ్య నున్న నిర్మల జలములో శ్రీరామ నామాంకితములైన ముద్రికలు వందల కొలది మెఱిసిపోవుచున్నవి. హనుమంతుడు వానిని చూచి ఆశ్చర్యపడి, వాని నన్నిటిని తీసికొని వెళ్ళుటకు రామాజ్ఞయులేక తిరిగి అయోధ్యకు వచ్చి శ్రీరామునకా యుదంతము చెప్పెను.

శ్రీరాముడా మాటలు విని నవ్వి ఆంజనేయా ఆ సరస్సున నున్నవి నా అంగుళీయక బింబ ప్రతిబింబములే. బ్రహ్మ ఆ ముద్రికలను పూజించుచు వాని మహిమవలన లోకములను ప్రయోజనకరముగ పాలించుచున్నాడు. నీవు పోయి ఒక ముద్రికన తీసికొని రమ్ము అని పంపెను. ఆంజనేయుడు వాయువేగమున సత్యలోకమునకేగి నిజమైన రామముద్రికను కొనివచ్చి శ్రీరామునకీయగా నతడు దానిని సీతకందజేసెను. హనుమంతుడెంతటి కార్యమునకైనను సమర్థుడనుకొని సీతారాములు పొందిన ఆనందమునకు మేరలేదు.

శ్రీరాముని పని నెఱవేరినది గదా అని హనుమంతుడును మిక్కిలి సంతృప్తి నంది శ్రీరాముని ఆదేశమునకై ఎదురుచూచుచు అంజలి ఘటించి యుండెను.

శ్రీరాముడంతట పరమ ప్రీతితో సుస్మిత వదనుడై, "ఆంజనేయా నీవు సత్యలోకమునకు పోయివచ్చితివి. అచ్చట అందరును, సర్వలోక శ్రేయమును గూర్చు నా ముద్రికను పూజించుచుండుట చూచి ఆనంద మందితివి. నీవును బ్రహ్మలోకాధి పత్యమందుదువుగాక. నీవెన్నో ఉపకారములను మాకు చేసితివి. నా అనుజుడు లక్ష్మణుని బ్రతికించితివి. నీ కార్యములన్నియు అనన్య సాధ్యములు. నేనెన్నో అవతారములను పూర్వము ధరించితిని ఇప్పుడీ యవతారము నడచుచున్నది. నా భక్తుడగు బ్రహ్మకు ప్రతికల్పమునందు నాకు ప్రతి నిధియగు ముద్ర ఈయబడుచున్నది. నీకు వలె ఆత్మసంయమనముగల భక్తుడు మఱియొక్కడు లేడు. నీవును రాబోవు కల్పమున బ్రహ్మవై లోకమున చరాచరసృష్టినంతయుగావించుచు వేదోక్త ప్రకారము సంచరించుచు నా ఆజ్ఞను పాలించుచు భక్తులను రక్షించుచు సుఖముగా నుండుము. ఇది నా యభిలాష, ఆజ్ఞయు నని హనుమంతుని అనుగ్రహించి శ్రీరాముడు పంపెను.

విష్ణ్వవతారుడైన శ్రీరామునేధ్యానించుచు ఆంజనేయుడు తన గంధమాదన ఆశ్రమము చేరెను.

శైలము గంధ మాదన మా ఆంజనేయుని నివాసము. లలిత లతా సురభిళ పుష్ప విలసితము, బహువిధఫల వృక్షపరివృతము, నిర్మలనదనదీజల ప్రవాహ సేవితము, మందగంధవహవీచికా తర్పితము, మృదు శాద్వలాన్విత సానుసంకలితము, కనకరత్నమణిశోభితమై గంధమాదనాచలము నిరంతరము సౌఖ్య ప్రదమై ప్రశాంతమై యొప్పుచుండును. అచట నిర్మితములైన పర్ణశాలలు సకల ఋతువులందును నివాస యోగ్యమై విలసిల్లును. అచటి యరణ్యము లందు తిరుగు ప్రాణికోటి పశుపక్ష్యాదులు, పిల్లి ఎలుక మొదలు గజ శార్దూల సింహముల వరకును అన్యోన్య మైత్రితో జీవించు చుండును ఇట్లు గంధ మాదన శైల ప్రాంతమెల్లను, ఆంజనేయుని తపోవాటికయే యైనది. ఆంజనేయునితో పాటు అచ్చట అతని పూర్వస్నేహితులు మహా ప్రభావశాలులు అయిన జాంబవంతుడు నీలుడు సుషేణుడు మైందద్వివిదులు పనసుడు వినతుడు మున్నగు వారెల్ల హనుమంతుని పార్శ్వ చరులై యుందురు. వచ్చిన భక్తులెల్లరును మున్ముందు వారిని పూజించి తరువాత ఆంజనేయుని పూజింతురు.

తన నివాస ప్రాంగణము సర్వము ఒక తపస్సీమ. ఆంజనేయుడు నిరంతరము వేదోపనిషద్రహస్యములు ధర్మశాస్త్ర ప్రబోధములు వినుచుండును. మునీంద్రు లేగుదెంచి తమ ప్రవచనములు గావింతురు. దేవతలేగుదెంచి హనుమంతుని ధర్మ పీఠమును దర్శించి హనుమంతుని స్తోత్రములు కావించి చను చుందురు. గరుడ గంధర్వ కిన్నరాది గగనచరులును వచ్చి హనుమంతుని దర్శించి నృత్యగీతములతో సన్నుతులు గావించు చుందురు.

త్రికాలములయందును ఆంజనేయుడు శ్రీరామార్చన యందాసక్తుడై యుండును. ఆంజనేయుడు ప్రపంచ స్వరూపుడు మంత్రరూపుడు. తన భక్తులెచ్చటెచ్చట నున్నను వారి క్షేమమును, ఆపద రాకుండ కాపాడుచు కార్యసిద్ధులొసగు విశాల హృదయుడు, అపార కృపావిరాజితుడు. దేవేంద్రాది దిక్పాలురు హనుమద్విగ్రహములను పూజాపురస్సరముగ అష్టదిక్కులను ప్రతిష్ఠించి జాంబవదాదుల కిచ్చిరి. ఆంజనేయుడీరీతిగ సకల లోకారాధ్యుడై, భక్త వరదుడై గంధమాదన తపో వాటికలో కదళీవనమధ్యమున, పారిజాత తరువు నీడ యందు నేటికిని విరాజిల్లు చుండెను.

త్రిమూర్త్యాత్మకుడై, సూర్యునికాంతిని, చంద్రుని చల్లదనము గలిగి సహజముగ తేజోవంతుడైన హనుమంతుడా గంధమాదనాశ్రమ వాటిక యందు రత్న రంజిత ధర్మ పీఠమున నున్నపుడు ఇనుమడించిన తేజస్సంపన్నుడై చూచువారల కెల్లరకు నొక అద్భుత దివ్య రూపముగ సుప్రసన్నుడై కనుపట్టును.

## శ్రీ ఆంజనేయదర్శనము

శ్రీరాముడుండిన కాలము కృతయుగమునాటి వాడు హనుమంతుడు. పదపడి త్రేతా ద్వాపరయుగములు గడచినవి. ఇది కలియుగము. ఆనాటి నుండియు త్రిమూర్తులతో సామ్యముగ పూజలందుకొనుచున్న దైవతమూర్తి ఆవుహాకపి. ఆతడు చిరంజీవి. నేటికిని గంధమాదనమున తన యాశ్రమమందుండి భక్తులను రక్షించుచున్నాడు. నిజరూపమున ఆతడెచ్చట నున్నను ఆయన పవిత్ర విగ్రహము గ్రామగ్రామమున ప్రత్యక్షమే. భక్తుడెచ్చట స్మరించినను ఎట్లు స్మరించినను తేజో వంతము గంభీరము, మహోన్నతమైన హనుమద్దివ్య రూపము కనుల ముందుండును. ప్రజాహృదయములలో అంత ఆప్యాయముగ ముద్రితమైన రూపమది.

హనుమంతుడు ప్రణవస్వరూపుడు మంత్రరూపుడు అది గాక, భక్తులు స్వేచ్ఛగ వారి వారి ఇష్టనామములతో చేయు పూజలు ప్రార్థనలు స్వీకరించు కరుణాళుడు. ఒకనికిగల భయములు చిక్కులు తొలగిపోవలెను అప్పుడతడు అభయాంజనేయుడు. ఒకని యత్నములు ఆటంకములు లేక సఫలముకావలెను. అప్పుడతడు వీరాంజనేయుడు. ఒకనికి ఇహపరసౌఖ్యములు కావలెను. అతడు భద్రాంజనేయుడు, ఒకనికి నిశ్చలాత్మచింతన యోగసిద్ధి సాధన కావలెను అతడు ధ్యానాంజనేయుడు. నిండు భక్తితో నొకడతనిని కీర్తించును. అతడు ప్రసన్నాంజనేయుడు; ఇట్లెన్నియో మార్గముల భక్తసులభుడైన దయామయుడా ఆంజనేయుడు. హనుమన్మాలమంత్రోపాసన వలన సిద్ధులగుచున్నవారున్నారు.

హనుమదనుగ్రహము నంది మహాకవులు ఋషులు ఎందరెందరో ఆ స్వామి మహిమను కథలను గాథలను వ్రాసి ప్రజలకందించినారు. వానిని విని

చదివి భక్తి శ్రద్ధలతో సేవించిన భక్తులు పిలిచినపలుకు భక్త ప్రియు డా అంజన కుమారుడు. హనుమన్మంత్ర విధులతో హనుమదుపాసకులై సిద్ధులయిన వారనేకులుగలరు. "నవనిధికేదాతా" అని తన హనుమాన్ చాలీసాలో గోస్వామి తులసీదాసు సంబోధించినాడు. ఆయన మహిమము, కరుణము, అనంతములు. హనుమానునిపై వచ్చిన సాహిత్య మొక క్షీరసాగరము. ఆదికవి వాల్మీకి రామాయణమున సుందర కాండ సర్వము హనుమన్మహిమా సౌందర్యమే. వివిధ పురాణములలో ఆయా చోట్ల హనుమంతుని గూర్చి ఉన్నది. పదపడి ఉమాసంహిత శౌనసంహిత పరాశరసంహితల వంటి బృహత్కావ్యము లున్నవి. స్తోత్రములున్నవి. అష్టోత్తర దశ, శత, సహస్ర నామావళులున్నవి, భజనకీర్తనలున్నవి, ఇక తెలుగులో ప్రతిరామ కథా గ్రంథమునందు ముఖ్యభాగము హనుమత్కథే. శతకములు పద్యములు లఘు కావ్యములు కీర్తనలు ప్రచార పత్రికలు సదస్సులు సంస్కృత కావ్యానువాదములు కోకొల్లలు.

లోకమెల్లరు ఇట్లేల హనుమానుని తలచి పూజింతురు? అసలు "ఆంజనేయ-హనుమ" అను పదములలోనే మహిమాన్వితమైన మంత్ర బీజాక్షరములున్నవని పండితుల వ్యాఖ్యానము. ఇష్టదైవముల నేయే నామముల పూజించినను అన్నియు ఈశ్వరునకు చెందునవియే తన్నిమిత్త ఫలముల నిచ్చునవియే".

'ఏకమ్ సత్ విప్రా బహుధావదన్తి' అని వేదవాక్యమున్నది. ఒక ధ్యానశ్లోకంలో

"ఆంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణు శివాత్మకమ్" అనియు హనుమత్ సహస్ర నామస్తోత్రంలో "సదాశివాయ నమః రుద్రవీర్యసము ద్భవాయ నమః" అని రుద్రనామములు, దశావతారనామములు, ఇతర దైవముల నామములును ఉన్నవి. భక్తుల మనస్సులలో వారూహించుకొనిన ఏ యిష్టదైవనామము లున్నను అది ఆ ఈశ్వరరూపమే. వాడవాడల వెలసిన మూర్తి. సర్వజనులకు ఆరాధనీయుడు. భక్తిభావ సంప్రదాయము విలసిల్ల జేయుటకు ఆవిర్భవించిన దివ్యమూర్తి హనుమంతుడు.

మహాభక్తులైన మన భద్రాద్రి రామదాసు, త్యాగయ్య హనుమానుని గూడ ధ్యానించి కీర్తించి తరించిన వారే. హనుమంతుని భక్తులలో చెప్పుకొన వలసిన

మహా పురుషుడు గోస్వామితులసీదాసు. రామ చరిత మానస అను ప్రఖ్యాత రామాయణమును హిందీ (వ్రజ) భాషలో వ్రాసిన ఇతడు 16వ శతాబ్దం వాడు. తన సమకాలిక సమాజంలో ధర్మాచరణ శీలం కొరవడి పరస్పర మత వైషమ్యాలు పెరుగుటతో తన రామాయణము వలన ప్రజలలో ఎంతో ధార్మిక చైతన్యంకలగ చేసిన వాడని ప్రతీతి. ఆయన అయోధ్యలోను కాశీలోను నివసించుచున్న సమయమున ఈ రామాయణముతోపాటు ప్రసిద్ధికెక్కిన "హనుమాన్ స్తోత్రమును" రచించి నట్లు చెప్పుదురు. ఇంతేకాదు.

హనుమంతుని సాక్షాత్కారము పొందిన మహాభక్తుడు తులసీదాసు. ఈ సందర్భమున ఒక కథకలదు. ఒకనాడు చిత్రకూటములో తనరామాయణ ప్రవచనము సాగుచున్న సభలో ఒకమూల కన్నీరు గార్చు ఒకరోగిని చూచి హనుమంతునిగా గుర్తించి ప్రణతులర్పించెను. హనుమంతుడు నిజస్వరూపమున ప్రత్యక్షమైనీకేమి కావలయునని అడుగగా రామలక్ష్మణుల దర్శన భాగ్యము నిప్పించుమని తులసీదాసు వేడుకొనెను. అట్లే అగును వారిని చందన తిలకములతో సత్కరించుమని చెప్పి హనుమానుడు అంతర్ధానమందెను.

యత్రయత్ర రఘు నాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం॥
బాష్ప వారి పరిపూర్ణలోచనం

అని కదా హనుమానుని గూర్చి చెప్పుదురు. మఱునాడు రామలక్ష్మణులు రాజకుమారుల వేషమున ఆ దారినేగుచుండగా తులసీ దాసు ధ్యానంలో ఉండి గుర్తింప జాలక మరల హనుమంతుని వేడగా" వచ్చిన వారిని నీవు గుర్తించ లేకపోయినావు. రేపు వారు మరల రావచ్చును" అని చెప్పి పంపెను. మరునాడా రామలక్ష్మణులు రాజకుమారుల వేషమున తన దగ్గరకే వచ్చిరి. వారి తేజస్సు ముఖవర్చస్సు చూడజాలక తులసీదాసు స్పృహ దప్పి పడిపోయెను. శ్రీరాముడే చందన తిలకమును తులసీదాసు ఫాలమున దిద్దివెడలెను. అట్లు హనుమద్రామ లక్ష్మణుల దర్శనము పొందిన మహనీయుడా భక్తుడు. రామ లక్ష్మణులు అంతర్ధానమందిన తరువాత తులసీదాసు "అయ్యో నా స్వామి ఒక నిముసమైన నిలువలేదు. నేనును ఆ క్షణమున పరిచర్య చేయలేకపోయితిని అని విచారించెను.

తులసీదాసు కీర్తి విని అతనిని తీసికొని రమ్మని ఒకసారి ఢిల్లీ నవాబు భటులను బంపగా, వారి ప్రయత్నములు సాగకుండ హనుమంతుని ఆదేశమున వందల కొలది వానరము లాభటులను అడ్డగించి వెనుకకు తరిమి కొట్టి ధ్యానమందున్న తులసీదాసునకు రక్షణకల్పించిన వని మరియొక ఐతిహ్యము కలదు.

తులసీదాసు సంగీత జ్యోతిశ్శాస్త్రములందు కూడ నిపుణుడు. ఒకసారి కాశీ వద్ద రాజఘాట్ రాజుకుమారుడు వేటకుపోయి దారి తప్పి పోగా ఆ రాజు తులసీదాసుని మిత్రుడు గంగారామ్ జోషి అను పండితుని తన కుమారుడెప్పుడు వచ్చునో చెప్పుమనెను. ఆ జోషి తులసీదాసు వద్దకే వచ్చి ఆ విషయము, నడిగెనట. తులసీదాసు చక్రము వేసి మఱునాడే వచ్చునని చెప్పెను. గంగారామ్ రాజునకామాట చెప్పగా రాకుమారుడట్లే వచ్చెను. రాజు సంతోషించి గంగారామ్‌నకు లక్షరూపాయలిచ్చెను. తులసీదాసు కారణముగా తనకీ సొమ్ము వచ్చినదని తలచి అతనినే ఆ సొమ్మును తీసుకొనుమని గంగారామ్ బలవంతపెట్టెను. తులసీదాసు పన్నెండు వేలు మాత్రము తీసికొని పన్నెండు హనుమంతుని గుడులు కట్టించినట్లున్నది. వానిలో ప్రసిద్ధమైనది కాశీలో సంకటమోచన్ ఆలయము.

శ్రీరాముడనినను హనుమంతుడనినను తెలుగు వారి కత్యంత ప్రీతి. హనుమంతుని గూర్చి తెలుగులో అసంఖ్యాకములైన దండకములు స్తోత్రములు శతకములున్నను, తులసీదాసు హనుమాన్ చాలీసాగూడ సమాన భక్తి శ్రద్ధలతో తెలుగు వారు పఠింతురు.

హనుమంతుని ప్రత్యక్షమహిమను గూర్చి ఒక చక్కని కథ చెప్పుదురు. చల్లపల్లి ఆస్థానమునందు దేవరకోటను దోచుకొనుటకు నిజామ్ ఆలీ గుఱ్ఱపు దండు వచ్చుచున్నపుడు దానిని నివారించు ఉపాయము చూడుమని సంస్థానాధిపతి వారి ఆస్థాన పండితుడు ముక్తేవి పెరుమాళ్ళయ్య కవిని వేడుకొనెనట. ఆ కవీంద్రుడు శ్రీకాకుళాంధ్ర విష్ణువు ఆలయములో వేంచేసి ఉన్న ఆంజనేయస్వామిపై "శత్రుహంతహనుమంత" అనే మకుటలంతో పద్యాలు చెప్పగా హనుమానుడు ప్రసన్నుడై శత్రువుల దండుపై పిడుగులు గురిపించి

దేవరకోటకు రాకుండ చేసెనట. ఈ విధమైన ఐతిహ్యములు ఈ కాలమందును చాల ఉన్నవి. దీనుల బాధలను తొలగింపగలవారెందరో హనుమదుపాసకులు ఉన్నారని ప్రజలలో విశ్వాసమున్నది.

సర్వదేవతా శక్తి సమర్థుడు, నిత్య కరుణాంతరంగుడు, సర్వ జనారాధ్యుడు బ్రహ్మవిష్ణు శివాత్మకుడైన హనుమంతుడు భక్తుల కెల్లవేళల సర్వాభీష్టఫల ప్రదాతయే.

# ఆంజనేయుడు మహాకవి – సంగీత శాస్త్రజ్ఞుడు

ఆంజనేయుడు శ్రీరామచరిత్రము నొక మహాకావ్యముగ రచించెనని చెప్పుదురు. ఆంజనేయుడు - మహాకవి సంగీత శాస్త్రసర్వజ్ఞుడు. ఛందస్సుందరములైన వేదములను కూలంకషముగ అధ్యయనమొనర్చిన పండితుడు. సర్వ శాస్త్రములను నేర్చినవాడు. అతడేది పల్కినను విర్దుష్ట పద ప్రయోగవప్పుదులవంగు కావ్యశైలిలో నుండుననగా ఆర్చర్యములేదు. సీతారాములతో, రావణునితో సుగ్రీవునితో ఆ మహనీయుడు నెఱపిన సంభాషణములు వాల్మీకిఋషి రచిత రామాయణమున నున్నవి. వానిని మఱియొకసారి చూచినచో హనుమంతుడు మహాకవియే అనిపించును. ఆతడు రామ కథను కవితా రీతిలో వ్రాసి గానమొనర్చియేం యుండును. ఏ దేవతాలోకమునందో ఎచ్చటనో ఉండి మనకది లభ్యముకాలేదు.

ఆంజనేయుడు సంగీతశాస్త్ర సర్వజ్ఞుడనుటకు నిదర్శనములున్నవి. సంగీత పారిజాత మను గ్రంథమును వ్రాసినట్లు చెప్పుదురు. "కర్తా సంగీత శాస్త్రస్య హనుమాంశ్చ మహాకపిః" అను వాక్యము సంగీతలోకమున వాడుకలో నున్నది. సంగీత మహాసభలలో హనుమంతుడు కీర్తింపబడుటయు తరచుగా చూచుచుందుము. సప్త స్వరకల్పనలో హనుమంతుడు కొన్ని అలంకారములనుడివి నట్లు ఇప్పటికిని సంగీత శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

భద్ర సంజ్ఞమలంకారం
ఆంజనేయో వదత్సుధీః
ఏకైకస్య స్వరస్యాత్ర
హసనాచ్ఛ క్రమోభవేత్

సరిగమలను జంటగను ద్రుతములుగను ఉచ్చరిస్తే వచ్చే భద్రాది అలంకారముల సృష్టి ఆంజనేయునిదే అనెదరు.

సగౌరిగౌసముచ్చార్య మగౌరిగౌతద్దైవచ
గ్రీవంలఘు ద్వయే నాత్రహనుమాన దత్సుధీః
ద్రుతాభ్యం లఘు కాలేన భాలంవదతిమారుతిః

ఇవి ఇలా ఉండగా హనుమానుని సంగీత శాస్త్ర ప్రజ్ఞాపాటవములకు ఒక కథను నిదర్శనముగా చెప్పుదురు.

దేవఋషులు నారద తుంబురలు త్రిలోకవిఖ్యాతి గనిన సంగీత శాస్త్రజ్ఞులు, మహావిద్వాంసులు, విద్వాంసుల మధ్య స్పర్ధ సహజమే అట్లే వారిరువురి మధ్య నేనెక్కువ నేనెక్కువ అనిన వాదము పెరిగి తుదకు కలహముగా మారినది. పరిష్కారము కొరకు పరమాత్మ వద్దకే వెళ్ళినారు. మీ తగువు తీర్చగలిగిన ప్రజ్ఞాశాలి హనుమానుడొక్కడే అని వారిని వెనుకకు బంపగా వారు హనుమానుని వద్దకేగి కపీంద్రా సంగీతమున మీ ప్రజ్ఞ నెఱిగియే ఇచ్చుటకు వచ్చినాము. మా యిర్వురిలో ఎవరు అధికులో సందేహము లేనిరీతి పరిష్కారము చేయుడని వేడిరి. ఆంజనేయు డాలోచించినాడు. ఇద్దరును మంచికీర్తిగల గానవిశారదులే. ఇరువురును తనకు పరిచయమున్నవారే. వారినొక శిలావేదికపై గూర్చుండబెట్టి హనుమానుడు తానే గాన మారంభించినాడు. రాల్లరగించు గాంధర్వ విద్యఅది. హనుమంతుని దివ్యగాన ప్రభావమునకు ఆ శిల కరిగినది. ఆయిరువురు గాయకోత్తములు దానిలో కూరుకు బిగిసిపోయినారు. పరమ గాయకోత్తములారా మీరొక రొకరే మీగానము వలన శిలను కరిగించి పైకి రండు అని హనువంతుడు నుడివినంత వారిరువురును ఒకరి తర్వాత ఒకరు వారి గాన శక్తి కొలది ప్రయత్నించిరి గాని ఫలితములేకపోయినది. హనుమానుడు తానే మరల సంకీర్తన చేసి వారిని బయటికి రప్పించి మీరు ఎవరికి వారే విద్వాంసులు. నేనేగొప్ప వాడనను భావము ఎవరికిని తగదు అని బోధించి పంపించెను.

# సువర్చలాంజనేయమ్

శ్రీ ఆంజనేయుని చరిత్రలో ఇదియొక సందేహాస్పదమైన ముఖ్య విషయము. ఆంజనేయుడు సూర్యుని శిష్యుడు. సువర్చల సూర్యుని పుత్రిక. ఆ మహనీయుడు బాల్యము నుండియు బ్రహ్మచారి అనియే పెక్కు మంది అభిప్రాయము, జనులలోగల వాడుకయు గూడ అదియే. ఇదమిత్థమని తెల్చుకొనుట కష్టసాధ్యము. కారణము పూర్వగ్రంథములలో రెండు విధముల పాఠములున్నవి. హనుమంతుడు సూర్యుని శిష్యుడు. అతడు నేర్చిన వేద విద్యత్ప్రకాశ ప్రభావము వలన హనుమానునకు మంచి ముఖవర్చస్సు వచ్చినది. సువర్చల అను పదమును తద్విజ్ఞాన వికాసమునకు సామ్యముగ హనుమానుడు మహావర్చస్వి అనుటకు సువర్చలాసహితుడు అని సాంకేతికముగా వాడిరని కొందరి వాదము. విఘ్నేశ్వరునకు సిద్ధి వినాయకుడను నామమే ఉన్నది. వాంఛాసిద్ధిని కలుగజేయువాడను అభిప్రాయముతోనే ఆ పదమును వాడుదురు. అట్లే సువర్చలాంజనేయు డను మాటగూడ. ఆలయములలోను ఇతర స్థలములందును ఉన్న విగ్రహములు హనుమాను నొక్కనినే చూపించునవిగా ఉన్నవి. ఎచ్చట నైనను సువర్చలా సహితునిగ నున్న మాత్రమున ఆమె హనుమానుని భార్య యనగలమా పూరి జగన్నాథాలయమున బలరామ కృష్ణులు సుభద్ర కలిసిన విగ్రహములకే పూజ. అంతమాత్రమున అన్యథాభావింపవలసిన పనిలేదు. ఇచ్చట లక్ష్మీదేవి రూపమే సుభద్రయను నామముతో నున్నట్లొక శాస్త్ర వాదమును కలదు.

అధ్యాత్మ రామాయణములో ఉమామహేశ్వర పరముగా నున్న స్తోత్రములో ''మూర్తి త్రయాత్మకం పీనం మహావీరం మహాహనుమ్ హనుమంతం వాయుపుత్రం నమామి బ్రహ్మచారిణం'' అని కూడ ఉన్నది. అయితే బ్రహ్మచారి అనుపదమునకు అవివాహితుడని కాక బ్రహ్మధర్మ మార్గ సంచారి అని కూడ చెప్పవచ్చును. గురుని కుమారితను వివాహమాడుట సంప్రదాయ విరుద్ధము, కూడదు అని అందురు. ఆంజనేయునంతటి మహాజ్ఞానికి ఈ మాటయేల. మన పురాణరచనలలో రచయిత భక్తి విశ్వాసముల కొలది అతిశయోక్తులున్నమాట సత్యమే. ఈ గాథలు జరిగి యుగయుగములు జరిగినవి. కాల క్రమమున ఆ

చరిత్రలలో ఎన్నో మార్పులు చేర్పులు సంభవించినవి. ఆ మార్పులు కొన్ని అసంబద్ధములు. 24000 శ్లోకములుగల రామాయణము 36000 శ్లోకములకు పెరిగినది. ఎవరిట్లు చేసిరి అను ప్రశ్నకు సమాధానము చెప్పజాలము. అట్లే ఆంజనేయుడు సువర్చలను వివాహమాడెననిన విషయము ప్రక్షిప్తమని కొందరు చెప్పుదురు.

ఆంజనేయుని మహిమను మైత్రేయ మహామునికి పరాశరమహర్షి వచించినట్లు పరాశరసంహిత యను బృహద్గ్రంథమున్నది పెక్కుచోట్ల ఆ గ్రంథమునందు సువర్చలాపతీ అను సంబోధనలేకాక భక్తులకు ఆంజనేయుడు సువర్చలా సహితుడై దర్శనమిచ్చినట్లు కథలు గలవు. హరిశర్మ కథ యందీ శ్లోకమును చూడుడు.

కంఠే హారం, శ్రవణపుటయోః కుండలే, స్కంధదేశే
బ్రహ్మంసూత్రం, కరకమల యోః కంకణాన్యంచితాని,
మధ్యే పీతం కనకవసనం చోర్ధ్వ పుండ్రంలలాటే
వామేదేవీం మిహిరతనయాం భిభ్రతం వానరేంద్రం॥

మిహిరతనయ అనగా సూర్యుని పుత్రిక. అలంకారభూషితుడు పీతాంబరుడైన సుందరుడు సువర్చలా సహితుడై హనుమంతుడు భక్తులకు దర్శనమిచ్చు చుండెనని భావము. సువర్చలా సహితుడైన హనుమదాలయములు కొన్ని చోట్ల ఉన్నవి. మారుతీ కళ్యాణమను పేరుతో సువర్చలాంజనేయుల వివాహోత్సవము జరిపి ఆనందింతురనియు చెప్పుదురు.

మఱియొక విషయము త్రిమూర్తులకు దిక్పాలకులకు వారి దేవేరులున్నట్లే కద మన పురాణములన్నియు - లక్ష్మీ పార్వతీ సరస్వతులు దేవీ ప్రధానాంశలై హరి హర బ్రహ్మలకు అంతశ్శక్తులై విరాజిల్లుచున్నారు. ఆంజనేయుని విషయములో కూడా అట్లే అనుకొనవచ్చును. కావలసినది దైవమునెడల భక్తి విశ్వాసములు. ధార్మిక సంస్కారము. ఇష్టాను సారము రూపభేదము లూహించుకొను స్వేచ్ఛ ఉన్నను, చిత్తశుద్ధిగల భక్తి భావము ముఖ్యము. భగవానుని దృష్టిలో అందరును సమానమే.

# హనుమంతునికి జరుగు పూజా విధానములు

పరాశర సంహిత 18వ 41వ పటలము అందు ఈ విధానములు విపులముగ చర్చింపబడినవి.

భక్తి తొమ్మిది విధములుగా చెప్పబడినది. అవి శ్రవణము. కీర్తన స్మరణ, పాదసేవనము, అర్చనము, వందనము, సఖ్యము ధాసత్వము ఆత్మ నివేదనము. ఇవి ప్రత్యేకముగా విష్ణువును గూర్చి చెప్పబడినను సకల దేవతా పూజలకును వర్తించును. అట్లే హనుమత్పూజా సందర్భమునను ఈ విధులు పాటింపనగును. తుదకు ఏమియు చేయజాలని వారు నడివీధినున్న హనుమద్విగ్రహమునకు వందన మాచరించి అటనున్న సిందూరమును ఫాలమున దాల్చి ఏగుదురు.

ఆచార ప్రకారము స్నానము, సంధ్య అయిన వెనుక గాయత్రీ మహా మంత్ర పూర్వకముగా ప్రాణాయామ మొనర్చి భూశుద్ధి యొనర్చి, రంగవల్లికలు దీర్చి, చిత్రాసన మేర్పరచి అష్టదళ పద్మ చక్రమునమర్చి, అందు వస్త్రాలంకార సింహాసనమునుంచి, త్రిమూర్త్యాత్మకుడు భక్త రక్షకుడు, కాంచన వర్ణ విభాసితుడు అయిన హనుమంతుని ధ్యానించుచు ఆ స్వామి ప్రతిమను అందు ప్రతిష్ఠించి 'ఆవాహితో భవ' సన్నిహితో భవ, స్థాపితో భవ, సమ్ముఖో భవ ప్రసీదో భవ అని ఉచ్చరించి షోడ శోపచారములు జరుపవలెను. ఈ పూజా విధానము నాలుగు ఆవరణలుగా వివరింప బడినది.

తరువాత హోమ విధానము చెప్పబడినది.

హనుమత్ సప్తాక్షరీ మంత్రమునుచ్చరించుచు ఆవునేయి ధారగా పోయుచు హవ్య ద్రవ్యమగు బియ్యముతో హోమము ప్రతిదినము చేయవలయును. గరిక, సమిధ, ఫలము, పత్రము, పూలు కూడ హోమ ద్రవ్యములుగా వినియోగింతురు.

ఇవియైన వెనుక మంత్రాంగ విధానమును భక్తులొనర్తురు. హనుమంతుని మంత్ర రూపమహిమ వర్ణింప ఎవ్వరికిని శక్యముగాదు. ఎక్కువ తక్కువ, పేద ధనికుడు, అను విచక్షణ స్వామికి లేదు. వారి వారి భక్తి తత్పరత ననుసరించి హనుమంతుని దయానుగ్రహ ఫలములు తప్పక కలుగును.

పుణ్య దినములందు పర్వదినములందును హనుమత్పూజ విశేషఫల ప్రదము. భక్తులకు ప్రతి దినము భగవత్పూజా విధియే. అయినను ఆయా తిథులందును ఆయా నక్షత్రములందును పూలు నివేదనలు ఆంజనేయునకు ప్రీతి కరములని శాస్త్రములందు నిర్దేశింపబడినవి.

ఈ పూజా విధానవము నందు ముఖ్య భాగవముగా చెప్పబడిన హనుమత్సూక్తము, పరాశర సంహిత 41వ పటలమున నున్నది. ఈ సూక్త పఠనము సకలాభీష్ట ఫలమనియు వర్ణింపబడినది.

హరిహరాది ముఖ్యదైవములకు జరిగినట్లే ఆలయములందు ఇతర ప్రదేశములందును నిత్య పూజలు సేవలు ప్రత్యేకముగ హనుమానునకును జరుగు చున్నవి. ఇతర దైవత పూజలకు వలసిన వైభవముల పట్టింపు హనుమానుని పూజకంత ఆవశ్యకములు కాకపోవుటయే హనుమానుని పూజ ఎక్కువ ప్రజాదరణ నందుటకు కారణము.

నిత్యదర్శనము నిత్యసేవలు గాక సంవత్సరములో హనుమానుని పూజకు రెండు ప్రత్యేక దినములున్నవి. ఒకటి హనుమజ్జయంతి. వైశాఖ బహుళదశమి శనివారం పూర్వాభాద్ర నక్షత్రము నాడు. హనుమపుట్టుక శనివారము నాడు కాదు, మంగళ వారము హనుమానుడు జన్మించెనని కొందరందురు. శనివారము మంగళవారము ఈ రెండును హనుమంతునకు ప్రీతికరములైనవే. ఆ వారములలో ఆ బాలవృద్ధులు పెక్కుమంది హనుమంతుని దర్శనము చేసికొని ప్రదక్షిణ నమస్కారములాచరించి తీర్థప్రసాదములు స్వీకరించుట ఆంధ్రమున ఒక విశిష్టాచారము. రెండవది, హనుమద్వ్రతము మార్గశిర శుద్ధ త్రయోదశి నాడు జరుపు కొందురు. విఘ్నేశ్వర, సరస్వతీ వ్రతములనాచరించిన విధముగనే హనుమద్వ్రతము యథా విధి చేయుదురు. మనధార్మికవిధానములో తపోధ్యానాది నిష్ఠలతో నిర్గుణ నిరాకార పరమాత్మను ఎట్లు భావింతురో సగుణాకృతులగు దైవ విగ్రహములకు చేయుపూజలకును అంత ప్రాధాన్యమున్నది. జ్ఞానయోగి యయిన శ్రీ శంకర భగవత్పాదులు గూడ సగుణమార్గదైవ పూజలకును ప్రాధాన్యమిచ్చిరి. వారి శివానందలహరి సౌందర్యలహరి, ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రములును ఇట్టివే.

పై జెప్పబడిన వ్రతములును నిర్దేశింపబడిన కొన్ని పర్వదినములున్నను ఇష్టదైవ మెవరైనను ప్రతిదినపూజార్హుడే. ఆడంబరములకన్న చిత్త శుద్ధిగల భక్తి ప్రధానము. గంపలకొలది మిఠాయిలు నివేదనమిచ్చినను లేక ఒక పండో పత్రమో అ చంచల భక్తితో నివేదన మీయగలిగినను భగవానుని కరుణాదృష్టి భక్తులపై ఒకే విధముగా నుండును. ఏమియు ఈయలేని వారు హృదయమిచ్చి నమస్సునర్పించినను భగవానుడు సుప్రసన్నుడే.

సర్వసామాన్యముగ హనుమానుని ఆకారమొకటి ఉన్నది. కుడి చేతితో అభయహస్తము, ఎడమ చేత భీకరమైన గదాయుధము. ఇట్టి విగ్రహమునే చాల చోటుల చూచుచుందుము. హనుమానుని మహత్త్వమంతయు ఆ సుందర గంభీర విగ్రహమందున్నది. భక్తుల భయములను పారద్రోలి సర్వసౌఖ్యములు భుక్తిముక్తులు ప్రసాదించు అభయ ముద్ర అది. మరొక ప్రక్క, భక్తుల వ్యాధి బాధలు కష్టనష్టములు భూత ప్రేత పిశాచముల పీడలు దరిజేరకుండ విధ్వంసమొనర్చు ఉగ్రగదాయుధముద్ర రెండవది. హనుమానునకు అసాధ్యమనునది లేదు. హనుమంతుని ప్రత్యక్ష దర్శనము పొందిన తులసీ దాసిట్లు స్తుతించినాడు.

దుర్గమ కాజ జగతకేజేతే, సుగమ అనుగ్రహతుమ్హారే తేతే॥
సబసుఖలహై తుమ్హారీశరనా, తుమరక్షక కాహుకోడరనా॥
భూత పిశాచనికట నహిఁ ఆవై మహా వీర జబనామ సునావై॥
ఔరమనోరథ జోకోయీ లావై తాసు అమిత జీవనఫలపావై॥
సంకట హటైమిటై సబపీరా, జోసుమిరై హనుమత బలవీరా॥
అష్టసిద్ధి నౌనిధికేదాతా, అసవరదీన్హజానకీమాతా॥

శ్రీరాముడు హనుమంతుని తన సమానము గనే చూచుకొనెను. హనుమంతుడు తృప్తినందినచో శ్రీరామునకు తృప్తియే.

ఇట్టి ఫలప్రదాత అయిన ఆంజనేయ విగ్రహమునే ఉదయమున నిదురలేవగానే మున్ముందు స్మరించి ధ్యానించి నిదురకు పోవనపుడట్లే మరల స్మరింతురు. పెక్కుమందికీ దైనందిన హనుమత్స్మరణ అలవాటే.

వివిధాలయములలో ఆంజనేయవిగ్రహము వివిధ రూపములలో

కానుపించును. విజయనగరాంధ్రభూపతి శ్రీకృష్ణదేవరాయలు తన గురువగు వ్యాసతీర్థులచేత అనేక హనుమదాలయములను నిర్మింప జేసెనట. ఎవరెట్లు రూపించుకొని పూజించినను, ఆంజనేయుడు ఆంజనేయుడే. పరమ కరుణాళుడు.

కొందరా స్వామిని పంచముఖ ఆంజనేయునిగా భావించి పూజింతురు. ఈ క్రింది శ్లోక మందులకు తార్కాణము.

వందే వానర నారసింహ ఖగరాట్ క్రోడాశ్వ వక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా॥
హస్తాబ్జైరసి ఖేలు పుస్తక సుధా కుంభాంశురద్రీన్ గదా.
ఖట్వాంగం ఫణిభూరుహే దశభుజం సర్వారిగర్వాపహం.

పంచముఖాంజనేయుడు శత్రు భయంకరుడు. భక్త జనక్షేమం కరుడు. పదునైదు నేత్రములవాడు - పది చేతులు - నానాలంకార శోభితుడు - దేదీప్య మాన తేజస్వి - చేతులందాయుధములేకాక పుస్తకము సుధాకలశమూ కూడ ఉన్నవి. తూర్పున వానరముఖం దక్షిణమున నారసింహముఖం, పశ్చిమమున గారుడముఖం ఉత్తరమున ఘోణివక్త్రం. ఉర్ధ్వమున అశ్వముఖం భక్త జనులకు ప్రసన్న సుందరమ్మైనది, శత్రువులకు భయంకరమ్మైన రూపమది. ఇందుకొన్ని విష్ణు సంబంధమ్మైనది, శత్రువులకు భయంకరమ్మైన రూపమది. ఆయాముఖముల కనుగుణములగు బీజాక్షర మంత్రములు ఉపాసనావిధులు ఉన్న హరిహరాత్మకరూపమ్మై ఆయా ఫలితాలు ఉపాసకులకు ఇచ్చే మహాస్వరూపం అది.

హనుమంతునకు భక్తులొనర్చు పూజావిధానము, విధులు పుణ్యా తిథులు మున్నగు వివరములన్నియు పరాశరసంహిత 41వ పటలమున విశదముగనున్నవి. హనుమంతుడు మంత్ర రూపుడు. ప్రణవస్వరూపుడు. హనుమన్మాలా మంత్రములు హనుమత్ సూక్తములు కూడ యీ పటలముననున్నవి.

హనుమజ్జయంతి, హనుమద్వ్రత పర్వదినములందు శక్తి కొలది హనుమంతుని విగ్రహమును చేయించి యథావిధిగ పూజా పీఠమున ప్రతిష్ఠించి పూజలొనర్తురు. బహువిధములగు తీయని పండ్లు పరిమళ పుష్ప పత్రములు ధూపదీప నీరాజనములు స్తోత్ర పాఠములు నివేదనములతో కూడిన

షోడశోపచారములొనర్చి ప్రదక్షిణ నమస్కారములర్పింతురు. శక్తి కలవారు నిష్ఠాపరులు ప్రతిదిన పూజలందును ఈ ఉపచారములన్నియు కావింతురు. తెలుగు వారు ముఖ్యముగ హనుమత్పూజలందు అరటి పండ్లు తమలపాకులు తులసీదళమాలలు తీయని అప్పములను నివేదన మొనర్తురు. హనుమంతుని కిష్టమగు సిందూరకుంకుమముతో పూజ చేసి ఆ కుంకుమను తీసికొని కండ్లకద్దుకొని తిలకముగ ధరింతురు.

హనుమంతుని రూపము వర్ణనాతీతమగు అత్యంత సుందర విగ్రహము. మణిగణకిరీట శోభితుడు. సిందూర తిలకాంచిత ప్రసన్నాస్యుడు, హేమవర్ణుడు హారవిభూషితుడు. సువర్ణోపవీత ధారి. కనక కుండల మండితుడు. దుకూలాంబరుడు ధ్యానముద్రాభిరాముడు. మహాబలుడు మహాతేజస్వి - కామరూప సమర్థుడు. సద్బ్రహ్మచారి. నిష్కళంక పవిత్ర చరిత్రుడు. శివస్వరూపుడైన ఆ మూర్తి నూహించుటే పరమ పుణ్య ప్రదము.

హనుమత్స్మరణమాత్రమున ఎన్నియో లాభములున్నవని, ఆ మహనీయుడు త్రిమూర్త్యాత్మకుడనియు ఆయనను పూజించిన సర్వ దేవతలు పూజింపబడినట్లేయనియు పూర్వ శాస్త్రములలో చెప్పబడినది. అవి మరొయొకసారి భక్త జనుల ఉపయోగార్థము ఇచ్చట ఉదహరింపబడుచున్నవి.

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా।
అజాడ్యం వాక్పటుత్వంచ హనుమత్ స్మరణాద్భవేత్॥
ఆంజనేయః పూజితశ్చేత్ పూజితాసర్వదేవతాః॥
హనుమన్మహిమాశక్యో బ్రహ్మణా పినవర్ణితమ్॥

ఇంతటి మహిమాన్వితుడైన హనుమానుని చిత్తశుద్ధితో ఉపాసింపగలవారికి ఏలోపమును ఉండదు. ఏ భయమును కలుగదు. ఆయన కరుణార్ద్ర హృదయుడు భక్తసులభుడు తన భక్తుల కెట్టి వరప్రదాన మొసగెనో చూడుడు.

ఐహికేషుచ కార్యేషు మహాపత్సుచ సర్వదా
వ్యసనే సమనుప్రాప్తే మాం స్మరేద్రామసేవకమ్॥
వాంఛితార్థాన్ ప్రదాస్యామి భక్తానాం రాఘవస్యతు
సర్వదా జాగరూకోస్మిరామ కార్యధురంధరః॥

నా భక్తులకు రామభక్తులైన వారికి ఎక్కడ ఏవిధమైన ఆపద వచ్చినా రామ దూతనైన నన్ను స్మరించుడు నేను జాగరూకుడనై మీ కోరికలన్నిటి తీర్చెదను. ఇది భక్తజనులకు హనుమానుడిచ్చిన వాగ్దానము.

అనన్యాః చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

ఇతర చింతలు మాని నన్నేనిరంతరము స్మరించి పూజించువారి యోగక్షేమములు నేనే నిర్వహింతును. అని అర్జునునకు తాను ఒసంగిన ఉపదేశమందు శ్రీకృష్ణ భగవానుడు పలికిన అమృత వాక్యములనే హనుమాను పలుకులు తలపింపజేయుచున్నవి.

హనుమంతుడు త్రిమూర్త్యాత్మకుడు. అంతటి శక్తి కలవాడు కనుకనే తన అభయదానమును అంతనిరా ఘాటముగ చెప్పగలిగి నాడు.

# హనుమంతుడు - మంత్ర రూపుడు

హనుమంతుడు మంత్ర రూపుడని మిక్కిలి ప్రసిద్ధి. మంత్రము మంత్ర జపము అనిన పదములకు గల అర్థము పరిశీలనార్హము. దైవ పూజా విధులందు ఈ పదములకు ప్రత్యేకార్థము కలదు. భక్తులు తమ తమ యిష్టదైవములను, వారి నామములకు ముందు వారి అనుగ్రహ ప్రాభవములను దెలుపు బీజాక్షరము లుంచి, వానికి మొదట ఓమ్ అను ప్రణవమును జేర్చి నమస్సులను తెలుపుచు తుట్టతుదను చతుర్థీ విభక్తిని జేర్తురు. తమ యిష్టదైవ స్వరూపములను మనసునందుంచి నిశ్చల ధ్యానమున మననము జేయుటయే మంత్ర జపము. కొన్ని మంత్రములు దైవ నామములతోనే ఉండును. ఉదాహరణకు ఓమ్ నమశ్శివాయ "ఓమ్ నమో నారాయణాయ" అనునట్లు.

మంత్రములందు కల బీజాక్షరములు ఆయా దేవతల బల పాటవములను ఆవాహన జేసికొనుటకు తపస్సిద్ధులేర్పఱచిన పవిత్ర పదములు. ప్రసిద్ధ ఆచారముగ బీజాక్షర సంయుతములైన మంత్రములను గురువుల నుండియే భక్తులుపదేశమును పొందుదురు. ఆ మంత్రములను హృదయములందు నిగూఢముగ నుంతురు. భగవంతుడు మంత్రాధీనుడని ఆర్యోక్తి - మంత్రముల కంతటి మహాశక్తి యున్నది.

సకల దేవతలకును వారివారి కేర్పఱచిన మంత్రములుండగా విశేషించి హనుమంతుని మంత్రరూపుడనుటలో ఒక ప్రత్యేకత ఉన్నట్లు తోచును. రామాయణములోని సుందర కాండ కథ యంతయు హనుమంతుని పాత్ర ప్రధానముగా కలదియే. సుందర కాండమును మంత్రశాస్త్ర మనియే విజ్ఞులందురు. ఆయా ఫలములను బట్టి హనుమంతుని గూర్చి భక్తులు అనుష్ఠించు పెక్కు మంత్రములున్నవి. చిన్నచిన్న హనుమత్ ప్రతిమలను నిత్య రక్షగా జనులు మెడలందు కట్టుకొని దగ్గఱనుంచు కొందురు. ఆంజనేయుడు అంతటి పూజామూర్తియు, పరమేశ్వర స్వరూపము కనుకనే మంత్ర రూపుడుగ పూజార్థమున జనులు భక్తితో భావింతురు. వైష్ణవులకు వైష్ణవుడుగ శైవులకు శైవుడుగ సర్వజన పూజ్యుడు హనుమంతుడు.

హనుమదుపాసకుల సాధనకు పెక్కు మంత్రములున్నవి.

హనుమన్మంత్రములు 500లు ఉన్నట్లు పురాణేతిహాసములు చెప్పుచున్నవి. కొన్ని మంత్రములకు పెక్కు రీతులును ఉన్నవి. శ్రేయః ప్రదములు సర్వకార్య సాధకములు భయ నివారకములు పిశాచాక్షరి మున్నగునవి, హనుమన్మాలా మంత్రము, హనుమన్మూలమంత్రములున్నవి. మంత్రోచ్చారణమునకు స్థలశుద్ధి చిత్తశుద్ధి ఉచ్చారణ శుద్ధి ఆవశ్యకము. సామాన్యముగ హనుమన్మంత్రము నుచ్చరించు స్వేచ్ఛయు కలదు.

తిష్ఠన్గచ్ఛ సమాసీనః-శయానుర్వాస్వపన్నపి
భుంజానో భాషమాణో వా-మల మూత్ర విసర్జనే
అనులోమ విలోమాభ్యాం- హనుమన్మంత్రముచ్చరేత్

అను శ్లోకము ఈ భావమునే విశదీకరించుచున్నది.

హనుమన్మంత్రము లెన్నియున్నవో అదే సంఖ్యలో చక్రవిన్యాసములును కలవందురు.

మంత్రోచ్చారణకు ముందు మూడు సార్లు ప్రాణాయామము చేయవలెను. అంతమునందును అట్లే చేయవలెను. హనుమన్మంత్ర చక్రము లన్నింటికి పదునారు ముద్రలు నాల్గు ఆవరణలు అయిదు న్యాసములును చేయదగియున్నవి.

హనుమన్మంత్ర శాస్త్రమొక మహార్ణవము వంటిది. అంతులేని అగాధ రహస్యములందున్నవి. హనుమదర్చనలలో మంత్ర విధాన మత్యుత్తమము, అత్యంత ఫల ప్రదమును. ఎవరెట్లు ఈ విధానమున పూజ చేయగలిగినను హనుమంతుడెల్లవేళల సుప్రసన్నుడు భక్తరక్షకుడునయి తత్ఫలితముల నిచ్చుదైవమే. భక్తులు హనుమన్మంత్రోపదేశమును సద్గురువుల నుండి పొందుట ఆచారము.

ఈ పూజా విధానములో పఠింపదగినదియు విశేషఫలప్రదమునయిన హనుమత్సూక్తము ఈ క్రింద నీయబడినది.

# శ్రీ హనుమ త్సూక్తమ్

## పరాశర సంహిత : 41వ పటలము

శ్రీ మన్తః సర్వలక్షణ సంపన్నః జయప్రదః సర్వాభరణ భూషిత ముదారం మహోన్నతోష్ట్రమారూఢః కేసరి ప్రియనందనః వాయుతనూజః యధేచ్ఛ పంపాతీర విహారః గంధమాదన సంచారః హేమ ప్రాకారాంచిత కదళీ వనాంతరనివాసః పరమాత్మా వనచరశాప విమోచనః హేమవర్ణాం నానారత్న ఖచితా మ మూల్యతరాం మేఖలాంచ స్వర్ణోపవీతాం కౌశేయ వస్త్రంచ బిభ్రాణః సనాతనః పరమ పురుషః మహాబలః అప్రమేయః ప్రతాపశాలీ రజిత వర్ణః శుద్ధ స్పటిక సంకాశః. పంచవదనః మహేంద్రా ద్యష్ట దిక్పాలక త్రయస్త్రింశద్గీర్వాణ ముని గణ గంధర్వ యక్ష కిన్నర పన్నగాసుర పూజిత పాద పద్మ యుగళః నానావర్ణః కామరూపః కామచారః యోగిధ్యేయః శ్రీ హనుమాన్ ఆంజనేయ విరాడ్రూపీ విశ్వాత్మా విశ్వరూపః పవన నందనః పార్వతీ పుత్రః ఈశ్వర తనూజః సకల మనోరథాన్నోదదాతు.

ఇదం శ్రీ హనుమత్సూక్తం యో ధీమాన్యేకవారం పఠే
ద్యది సర్వేభ్యః పాపేభ్యోవిముక్తో భూయాత్.

తా॥ : ఈ శ్రీ హనుమత్సూక్తమును ఏకాగ్రబుద్ధితో ఒక్కమారు, పఠించినను ఆతడు సమస్తములగు పాపములనుండి విముక్తుడగును.

# హనుమత్ప్రబంధము

## మూడవ భాగము

## ఆంజనేయుని మహిమను తెలుపు కథలు గాథలు

వెనుక చెప్పబడిన అధ్యాయములలో ఆంజనేయుని చరిత్రమును గూర్చియు, ఆంజనేయ తత్త్వమును గూర్చియు కొంత వివరింపబడినది. ఆ మహనీయుని గూర్చి సంపూర్ణముగ నుడుపుట బృహస్పతి కైనను శక్యముగాని పని. రాముని కాలము నుండి ఈ నాటి వరకు హనుమంతుని గూర్చి ఎన్నో స్తుతి పాఠములు చరిత్రలు కావ్యములు శతకములు కోకొల్లలుగా వచ్చినవి. ఇకముందును ఇట్లే వచ్చును, ఎల్లకాలము ఇట్లే వచ్చినను పరమాదర్శ ప్రాయములైన ఆయన సద్గుణములు మహత్త్వము దయా స్వభావము ఎన్నిసారులెందరు ఎంతగా వర్ణించి వ్రాసినను చాలదు. ప్రపంచ మున్నంతకాలము వారి చరిత్ర ఇట్లే లిఖింపబడుచు పఠింపబడుచు భక్తజన రక్షయై మానవ జాతికి స్ఫూర్తిదాయకమై విరాజిల్లుచుండును.

మన పూర్వ ఋషులచే బోదింపబడుచు యుగ యుగముల నుండియు నిరంతర జీవనదీ ప్రవాహము వలె వచ్చుచున్న ఆంజనేయ చరిత్రను గూర్చిన కావ్యములు అసంఖ్యాకములుగ నున్నవి. అందు పరాశర సంహిత యనునది ముఖ్యమైనది. వందల కొలది గల పటలములలో వేలకొలది శ్లోకముల గల గ్రంథమిది. వ్యాస భగవానుని తండ్రి పరాశర ఋషీంద్రునిచే మైత్రేయమహా మునికీ ఆంజనేయ చరిత్ర బోధింపబడినది. సంహిత అనగా వేదమునందొక భాగమని అర్థము. ఈ చరిత్రను గూడ పరాశరసంహిత అనుటలో వేదముల కున్న మహత్త్వము కల శాస్త్రము ఈ హనుమంతుని చరిత్రయని చెప్పటయే. ఈ సంహిత నుండి తీసి కొనబడిన కొన్ని కథలు ఈ తరువాతి పుటలలో నీయబడినవి.

పరాశురుడనగా మైత్రేయుడనగా పరమ సిద్ధులైన మహర్షులు. వారి వలన మహాభాగ్యముగా మనకందిన శ్రీ ఆంజనేయుని చరిత్రము సర్వ జనులకు పఠనీయము, పూజనీయము. ఇహపర సౌఖ్యప్రదము.

# కపిలుని చరిత్రము

## పరాశర సంహిత – 21వ పటలము

గంగాతీరమున బార్హస్పత్య పురమను గ్రామమున కపిలుడను నొక విప్రుడు కలడు. అతడు సదాచార సంపన్నుడు. దైవచింతనుడు. తన కాలము నంతయు దైవనామ జపమునందే గడపుచుండువాడు. భార్యా పుత్రులను పోషించుకొన లేని దరిద్రుడయ్యు హనుమంతుని మంత్రమును జపించుకొనుచు సాయంతనమగు సరికేదో కాయగూరయో ఆకు కూరయో తీసికొని యింటికి పోయి దాని తోనే తాను కుటుంబముతో కాలక్షేపము సేయుచు అప్పుడప్పుడు అదియునులేక పస్తుండువాడు.

ఒకనాడు గంగయందుండి హనుమన్మంత్రము పఠించుచు కాల గమనము కూడ నెరుగక జపదీక్షాతత్పరుడై యుండగా ధ్యానమూర్తియగు హనుమంతుడు ప్రత్యక్షమయ్యెను. నాలుగు చేతులు, చంద్రుని బోలు దేహకాంతి, తెల్లని జందెము. రత్నకుండలములు, దువ్వలువలు, దర్భల మొలత్రాడు. ఆమూర్తి దివ్య తేజోమయముగా ప్రకాశించుచుండెను. ఆ వానర శ్రేష్ఠుని ప్రక్క జాంబవంతుడు వినతుడు నలుడు మైందుడు ద్వివిదుడు కూడ నుండిరి. వారందరును హనుమద్భక్తులే. హనుమవాలమునకు అభిషేకము చేసిన జలము వలన అచ్చట ''వాల సాగర'' మను నదియును పుట్టినది. కపిలు డానదిని పూజించి జాంబవదాదులను పూజించి హనుమకు ప్రార్థనలు పూజలర్పించి చీకటి పడుటచే ఇంటికి మరలెను. ఈ భక్తుడు చేయుచున్న పూజలు చూచిన హనుమంతున కెంతయో తృప్తికలిగినది. ఏదైనను కోరుకొమ్మని చెప్పినను హనుమత్స్మరణలో అన్నియును మరచిన విరాగియతడు. ఏమియు కోరుకొనక అట్లే యిల్లు చేరుకొనెను.

అయ్యో కూరాకు అయినా చేతితో పట్టుకొని రాలేదు. ఈ రాత్రి ఏమివండి పిల్లలకు పెట్టెదను. కట్టుకొనుటకు బట్ట, తినుటకు తిండి యీయలేని ఈ సంసార మెట్లు సాగును. మీ జపతపములు మీ పిల్లల కొకనాడయినా తిండిపెట్టగలవా! ఎందులకీ వృథాశ్రమలు అని ఆరాత్రంతయు కపిలుని భార్య విసుగు కొనుచునే త్రాగుటకు మంచి నీళ్ళిచ్చి పిల్లలను పరుండ బెట్టినది.

మఱునాడు తెల్లవారినది. భార్య అదే సణుగుడు. ఎంత చెప్పినను వినదు. ''నాకు నిన్న హనుమంతుడు ప్రత్యక్షమై ప్రసన్న ముఖమున నన్ను చూచినాడు.

నాజన్మ ధన్యమైనది. మరేమి కావలెను'' అని కపిలుడనగా భార్యవెంటనే, ''ఔను! హనుమంతుడు గొప్పవాడే, మీరునూ ధన్యులు. మీ కుటుంబమునకు మాత్రము దారిద్ర్యము తప్పదు ''అని విసుగుకొనుచుండగా వినలేక కపిలుడు వాలసాగరమునకు హనుమన్నామ జపమునకేగెను. అతడా నిష్ఠలో నుండగా హనుమంతుడు ప్రత్యక్షమయి కపిలుడు లోలోపల పడుచున్న బాధను తెలిసికొని ''కపిలా నీవు నా భక్తుడవు మీకు క్షేమ సౌఖ్యములు కలుగజేయుట నా కర్తవ్యము. మీ పెరటిదొడ్డిలో రేగు చెట్టు క్రింద ధనము పాతర నిధియున్నది. దానిని తీసికొని సుఖింపుడు అని వరమిచ్చి పంపెను. కపిలుడు సంతోషముతో ఇంటికివచ్చి భార్యకీ వార్తను తెలుపగా, ఆమెకేమాత్రము సంతోషము కలుగలేదు సరికదా మరల భర్తను నిందించుటకు మొదలిడెను. ''సరసముగనే ఉన్నది. మీరు భక్తులు హనుమంతుడు భగవానుడు. భక్తుని యందు దయ ఉన్నచో తానే ఈ రాతి నేలను త్రవ్వి ధనపు బిందెను తీసియీయవచ్చునుగదా. శ్రీరాముడు సేతువును కట్టినపుడు పెద్ద పెద్ద బండలనే అతడు పెకల్చుకొనివచ్చెనని మీరు చెప్పుదురు. ఈమాత్రపు బరువు ఆయన త్రవ్వితేలేడా! మీరు త్రవ్వుదురా, నేను త్రవ్వుదునా! నేలలో నున్న ధనము ఉన్ననూ లేకున్ననూ ఒకటే'' అను మాటలు కపిలుడు వినలేకపోయెను.

పరమ కరుణామూర్తి దయదలచి వరమిచ్చినాడు. దానిని త్రవ్వి తీసి మోసికొనివచ్చు భారము కూడ భగవంతునిదేనా. నా భాధ నాకే ఉండునుగాక నేనీమాటలా భగవానునకు చెప్పజాలను అని హనుమత్ షోడ శాక్షరీ మంత్రము జపించుచు కపిలుడు పరుండెను. తెల్లవారినది. కపిలుని భార్య నిద్రలేవగనే కనులు మిర్మిట్లు క్రమ్మినవి. బంగరు నాణెములు రత్నములు మణులు నిండిన ధనపు బిందె తనముందున్నది. ఇల్లంతయు బంగరుమయముగా వెలిగిపోవుచున్నది. హనుమంతుని దయాభిక్షకు అవశుడై కపిలుడు స్తోత్ర పాఠములు చేయదొడగెను. కపిలుని భార్యకు తెలిసివచ్చినది. భగవంతుని దయకు అసాధ్యమనునది లేదని, ఇంతవరకు తాను నిరర్థకముగ కాలము గడపినందులకు పశ్చాత్తాపమునంది కపిలుని భార్య తానును భక్తురాలయి హనుమంతుని పూజలనొనర్చెను. లబ్ధమయిన ధనమందు కపిలుడు భార్యయు తమకు కావలసినదే తీసికొని వాడుకొనిరి. తక్కినది హనుమద్భక్తులకు పంచిపెట్టిరి.

ఆ దంపతుల సద్భక్తికి సంతసించి వారికి ఇహమందు ఏలోపము కష్టము లేకుండ చేసి, పరమందు ముక్తిని గూడ హనుమంతుడు ప్రసాదించెను.

# కశ్యపుని కథ

## పరాశర సంహిత - 22వ పటలము

బ్రహ్మావర్తమనను గ్రామమున కశ్యపుడను బ్రాహ్మణుడొకడు నివసించుచుండెను. అది ధన ధాన్య సంపన్నమగు గ్రామము. కశ్యపుడును ధన వంతుడైన గృహస్థే. జపతపములు సదాచారములు అతిథి పూజలు వదలక నిత్యము హనుమంతునికి షోడశోపచారములతో పూజలర్పించుచు ధన్య జీవియై కాలము గడపుచుండెను. ఇట్టి సదాచారములు నీతి నియమములు, ఎచ్చటనుండునో హనుమంతుడచ్చట భక్తరక్షకుడై యుండును. తన భక్తుడైన కశ్యపునకు కావలసిన వస్తువులన్నియు లభ్యమగునట్లు ఆ దేవుడే చూచుచుండెను.

కశ్యపుని యింటగల ధన వస్తు సమృద్ధిని కనిపెట్టి ఒక గజదొంగ ఆ యింటికి కన్నము వేసి ఎత్తుకొని పోవలెనను ప్రయత్నముతో నుండెను. కాని ఆ దొంగ ఎప్పుడు వచ్చినను ఆయుధ హస్తుడైన కావలి వానిగనో వేరొక రూపముగనో హనుమంతుడే అడ్డుతగిలి వాని ఆటలు సాగనీయకుండెను. ఎట్లో అవకాశము చూచుకొని ఒకనాడు మఱినలుగురు తోడు దొంగలను వెంటబెట్టుకొని కశ్యపుని యింటికి కన్నము బెట్టి లోనికి రాబోవునంతలో హనుమంతుడే కశ్యపుని వేషముతో ఆ దొంగ చేతిని గట్టిగా పట్టుకొని లోనికి లాగెను.

ఆ చోరుడును లొంగక హనుమంతుని తనవైపునకు లాగుచుండెను. ఈ సందడిని విని తోడు దొంగలు పాఱిపోయిరి. పెద్ద దొంగ ఒక్కడును హనుమంతునిచే చావుదెబ్బలు తిని విలపింప సాగెను. రాజభటులు చూచినచో వీనిని శిక్షింతురను దయతో దొంగను వదలి హనుమంతుడు అంర్ధానమందెను. ఇంతలో వీధిని బోవు నలువురును ఆ దొంగను పట్టుకొని చితుకదన్ని వదలిరి. ఆ దొంగ కాళ్ళీడ్చుకొనుచు తనదారిని తాను పోయెను.

తెల్లవారగనే తనయింటికి పడిన కన్నమును చూచి కశ్యపుడు దొంగ దొంగ అని పెద్దగా అఱచెను. వీధి నున్న వారు " ఇదియేమి కశ్యపా! నీవే గదా ఒక దొంగను రాత్రి పట్టుకొని చితుకదన్ని వదలితివి. అతడు పోవుచుండగా మేము చూచితిమి. ఏమియు ఎఱుగనట్లు మాటలాడుదు"వని మందలించిరి. కశ్యపున

కంతయు ఆశ్చర్యమైనది. కొంతసేపు మిన్నకుండి ఆలోచించుచున్న సమయమున హనుమంతుడే తన రూపమున ఈ దొంగను పారద్రోలి తనయింటిని రక్షించినట్లు తోచినది.

కశ్యపుని తలపులన్నియు హనుమంతుని పై భక్తితో నిండినవి. ఆహా! యీ దొంగ ఎంత పుణ్యుడు! భగవానుడైన హనుమంతుని హస్తస్పర్శ పాదస్పర్శ పొందెను. ఎంత తపశ్శాలికైనను లభ్యము కాని భాగ్యమిది. నేను పాపాత్ముడను. మొద్దునిద్ర పోయితిని. హనుమంతుని దర్శన మైనను నాకు కాలేదు. ఇంకను ఎన్ని జన్మలెత్తవలెనో ఆ దయామయుని అనుగ్రహము పొందుటకని చింతాతప్తుడై పూర్వము కన్న మిక్కుటముగా హనుమంతుని పూజించుచుండెను.

హనుమంతుడు అపార కృపాంతరంగుడు. తన భక్తుడైన కశ్యపునకెట్టి కష్టము రాకుండ కాపాడుచు తుదకు పరమపదానంద ప్రాప్తిని కలిగించెను.

## హరిశర్మ కథ

## పరాశరసంహిత - 23వ పటలము

పవిత్ర గోదావరీ తీరమున కుశతర్పణమను గ్రామమున హరిశర్మయను బ్రాహ్మణోత్తముడు నివసించుచుండెను. అతడు వేద వేది. సర్వ శాస్త్రజ్ఞుడు హనుమన్మంత్ర జపనిష్ఠాతత్పరుడు. జగమున హనుమంతుని మహిమ కన్న మఱియొక్కటి లేదను నిశ్చల విశ్వాసము కల భక్తుడాయన. ఉదయమున లేచినది మొదలు రాత్రి నిదురకేగువరకును హనుమన్నామ సంస్మరణము తక్క మఱియొక్కటి యెఱుగని హనుమదుపాసకుడు.

ఆతని మనసున ఒకనాడొక ఆలోచన తట్టినది. నిత్యము ఈ సంసార బంధమున జిక్కియిచ్చుటనే పడియుంటివి. పుణ్య భారత భూమి యందు ఎన్నియో క్షేత్రములు తీర్థములు భగవన్మందిరములున్నవి. జన్మమెత్తి నందులకొక మారయినను వానిని దరిశించుట చరితార్థతయనుకొని ఆ మఱునాడే సుముహూర్తమేర్పఱచుకొని బయలుదేరినాడు.

మున్ముందు శ్రీకృష్ణ దేహసముద్భూతయగు కృష్ణానది కేగి పితృ తర్పణాదులను కావించుకొని అటనుండి శ్రీశైలమును జేరి భ్రమరాంబా సహితుడగు శ్రీ శివుని దర్శించి పూజించి, మార్గమధ్యమున భక్త వత్సలుడు అహోబిల లక్ష్మీ నృసింహదేవుని స్తోత్రము జేసి మహాభక్తుడగు ప్రహ్లాదుని గాంచి పూజించి పవిత్ర వేంకటాచలమును దర్శించు వాంఛతో బయలు దేరెను. మార్గ మంతయు దుర్గమారణ్యము, కొండలు, నదులు; వీనిని శ్రమ కోర్చి దాటిపోవుచూ క్షుత్పిపాస బాధతో పాటు ప్రచండముగనున్న సూర్యుని తాపమున కోర్వలేక హరిశర్మ స్పృహతప్పి పడిపోయెను. ఆ విప్రుని చూచువారెవరు. దీనులకు దేవుడే బాంధవుడు. ఎవరో ఒక శూద్రుడాదారిని పోవుచు మాట లేక పడియున్న యాత్రికుని జూచి కరుణాంతరంగుడై మేల్కొల్పి "ఓ యాత్రికుడా ఎవరు నీవు ఎచ్చటికేగుచున్నావు ఈ యెండలో ఇట్లు పడియున్నావని అడిగి తనవద్దనున్న అన్నమునిడి అచటి సెలయేటిలో నీటిని తెచ్చియిచ్చి సేదదీర్చెను". ఆహా యెవరీతడు దేవునివలె వచ్చి నన్ను రక్షించినాడు". అనుకొని అతనితో

మాటలాడుటకు హరిశర్మ ప్రక్కకు తిరుగగా ఆహారమిడిన ఆ శూద్రుడు కానుపించనే లేదు. ఆ మహాత్ముడు భక్త బాంధవుడు ఆంజనేయుడేమో అని కొంత యోచించి తుదకు, పిన్ననాటినుండియు నిరంతరము హనుమత్ స్మరణము పూజలొనర్చుచున్న నాకీ నాటికిని హనుమానుడు కానుపించనేలేదు. ఆ రూపమెట్లుండునో చూడనే లేదు. ఇక నీ జన్మకు ఆ భాగ్యము నాకు లేదేమో. కానిమ్ము నేనిట్లే ఎన్ని జన్మములకైనను హనుమద్భక్తుడనే అనుకొని తనకు అన్నమిడిన వ్యక్తికి మనస్సులో నమస్సులర్పించి తన యాత్రకు సిద్ధమగుచుండగా సుంధదర సువర్ణ వర్ణుడు. కుండల ధారి యజ్ఞోపవీత కనకాంబర మౌంజీ భూషితుడు ఆజాను బాహుడయిన ఆంజనేయుడు ప్రత్యక్షమై 'ఓ విప్రుడా నీవు నా భక్తుడవు నీ యోగక్షేమములరయచు నేను నీకడనే యుందును. నీ కన్నమిడి దాహము తీర్చిన వ్యక్తిని నేనే. నీవిక భయపడ వలదు నీ యాత్రలు ముగించుకొని క్షేమముగా నీయిల్లు చేరుకొందువని దీవించి అంతర్థానుడయ్యెను.

హరిశర్మ కంతయు మహాశ్చర్యముగ తోచి పరమానంద భరితుడయ్యెను. ఆ ఆనందముతోడనే వేంకటాద్రిపై నున్న పద్మా వేంకటేశ్వరుల నర్చించి ప్రసాదముగైకొని, కంచిలో వరదరాజస్వామిని శ్రీ కావేరితీరమున శ్రీ రంగనాధుని దర్శించి పూజలర్పించి సంతుష్టాంతరంగుడై తన యింటికి క్షేమముగా చేరెను.

హరిశర్మ తన గ్రామమునందున్న బంధు మిత్రులను ఆహ్వానించి, హనుమత్ పూజ భక్తి శ్రద్ధలతో కావించి, తీర్థ ప్రసాదములు విందు భోజనముతో వారిని సంతృప్తులగావించి, తన యాత్రా విశేషములు, మార్గమధ్యమున హనుమంతుడు తనకు సహాయమొనర్చిన విధము నుడివెను. అతిథులెల్లరు హరిశర్మ అదృష్టమునకు సంతోషించి హనుమంతుని కథలు చెప్పుకొనుచు గృహములకేగి భక్తి శ్రద్ధలతో హనుమంతుని పూజలను యథావిధిగ జేసి ధన్యులైరి.

తనకుటుంబమున ఏలోపములేని సమృద్ధితో నిరంతర హనుమత్పూజా తత్పరుడై హరిశర్మ కాలము గడపుచు తుదకు మోక్షసిద్ధి నందెను.

# త్రిశూలరోముని వధ

## పరాశర సంహిత - 31వ పటలము

ఆంజనేయుని కొకసమయమున పంపాతీర ప్రాంతములకు విహారము కేగు తలంపుదయించినది. దక్షిణ భారతమున నున్న ఒక పుణ్య సరోవరము పంప. సుగ్రీవుని కొలువులో నుండగా ప్రప్రథమమున ఆంజనేయుడు రామ లక్ష్మణులను చూచిన దా పంపాసరోవర ప్రాంతములందే. ఆ కారణమున తత్ప్రాంతములను మరల చూచు ఆసక్తి ఆయనకు కలిగినది.

పవిత్రత యందు మానస సరోవరమునకు దీటైన కొలను పంప. ఎల్లవేళల కైరవ పుష్ప శోభితము, నిర్మల జలాన్వితము, తీర ప్రాంతలతా గుల్మ కుసుమ సురభిళ గంధవహతర్పితమైన యా కాసారమెల్లరకును కనుల పండువు. నిలింపవనమునకు సమానమగు శీతల వన ప్రాంతము లాపంపా పరిసరములు. సీతావియోగమున కలత జెంది ఆమె కొరకు అటవీ సీమలు వెదకుచు వచ్చుచున్న సలక్ష్మణుడైన రాముని పంప వైపునకు వెళ్ళవలసినదని శబరి ఆదరించి పంపినది. అచటనే ఒకింత మనశ్శాంతి శ్రీరామ చంద్రునకు కుదిరినది. రామాంజనేయు లిరువురుకు పరస్పర మైత్రి గౌరవము అవగాహన కుదిరినదచ్చటనే. అదియే హరిహరాత్మకమైన సమ్మేళనము.

ఆంజనేయుడు తన వాహనమైన ఒంటెపై నరుదెంచినాడు. కాంచనవర్ణము, రత్నకుండలములు సువర్ణ యజ్ఞోపవీతము, రుద్రాక్ష తులసి హారము నుదుట నిలువు సిందూర తిలకము, ప్రభుకిరీటము, పట్టు పీతాంబరములు, బలిష్ఠమైన గద కలిగిన మహా తేజో వంతమైన ఆ స్వరూప కాంతులవలన నలుదెసలు భాసమానములైనవి. ఏదో విశేషముండియే ఆంజనేయుడు బయలుదేరు చున్నాడని సుషేణ జాంబవదాదులు ఆయన వెంట వెడలిరి. భక్తవరదుడగు ప్రభువరుడేతెంచుచున్నాడని మార్గము వెంట సర్వ ప్రదేశములందు భక్తులాయనను దర్శించి పూజలుగావించి నీరాజనములర్పించి దీవనలందుకొను వారే. కొందఱాయనను అనుసరించి వెళ్ళిరి.

పంపా తీరమునకు పావని వచ్చుచున్నాడని తెలిసి పరిసరవాసులు, సమీపముననున్న వానర రాజ్యము కిష్కింధావాసులు ఆంజనేయుని దర్శించి

ధన్యులమైతిమనుకొని సంతసించువారే. పంపాజలముల స్నానమాడుచు అచట లభించిన ఫలపుష్పములతో శ్రీరామ విగ్రహము నర్చించుచు సాయంతన మగుదాక ధర్మ పీఠమునందాసీనుడయి వేదోపనిషచ్ఛాస్త్రప్రవచనముల నచటి తపశ్శాలులచే చెప్పించువాడు.

ఒకనా డుదయమున మధుర బృహతీనాద గీతముతో దేవముని నారదు డరుదెంచినాడు. ఆంజనేయు డెదురేగి నమస్కారములర్పించి, అర్ఘ్య పాద్యాది సేవలందించి అచటిశిలా వేదికపై మెత్తని ఆకులతో ఆసనమేర్పరచి ఆ సీనుని జేసి మధురఫల రసములు పట్టుతేనెలతో తృప్తి నొందించి, అన్యోన్య కుశల ప్రశ్నములయిన వెనుక ఆంజనేయుడు దేవమునీంద్రా! నీ దర్శనముచే మా బ్రతుకులు ధన్యములైనవి, ఈ ప్రాంత మంతయు మఱింత ధన్యమైనది త్రిలోక సంచారివి నీ వెఱుగవి విశేషములుండవు ఏమైన నేను వినదగు మాట యున్నచో సెలవిండు అని నమ్రుడై అడిగెను.

నారదమునీంద్రుడంతట "ఆంజనేయా! శివాంశ సంభూతుడవయిన మహనీయుడవు, రామ మంత్ర మహిమాన్వితుడవు అప్రతిమాన ప్రజ్ఞా ధురంధరుడవు, భక్త వత్సలుడవు లోకపూజ్యుడవు, నీవింత వినతుడవై నాకు పూజలొనర్చుట నాకే ఆశ్చర్యమగుచున్నది. మాచే పూజలందుకొనుటకు సర్వవిధముల అర్హుడవు. మిమ్మొకసారి చూచిపో వలయుననియు ఒకమాట మీచెవిని వేయవలయునని నా అభిలాష. కాలచక్రము పైకి క్రిందకు పరిభ్రమించుచునే ఉండును. రామావతార కాలమున యావద్భారత వర్షమున దానవ దౌష్ట్యములంత మొందినవి. మరల ఆ విషపు దుంప నుండి అంకురములు బయలు వెడలి తీగలల్లి వ్యాపించుచున్నవి. అసిరోముడను మహారాక్షసుడు ప్రజలను నానాబాధలకు గురి చేసి యేగినాడు. వాని కుమారుడు త్రిశూల రోముడు అంతకన్న క్రూరుడు. తీవ్ర తపశ్శాలి. శంభుని వలన వరములందినవాడు. త్రిజగములందున తనకన్న బలవంతులు లేరని విఱ్ఱవీగుచు తన పరిపాలనము సాగించుచున్నాడు. పచ్చి రక్తము త్రాగు మాయావి యతడు. అతడు చేయని ఘోరవములు లేవు. పూజలు సాగవు. క్రతువులు నెరవేరవు. ప్రజలు భయపడుచున్నారు. అతడీ ప్రాంతమునందే స్వేచ్ఛగా తిరుగుచున్నాడట ఎవరును

అడ్డువారు లేకున్నారు. అనుమాటలు వినగానే హనుమంతుడు ఒక త్రుటికాలము ఆలోచించి మునీంద్రా! వినదగిన విషయమే చెప్పితివి. రాక్షసుల ఘోరములు తెలిసినవే. ఇంకను వర్ణన మెందులకు, ప్రస్తుతము నేనిచ్చటనే ఉంటిని గదా. ఆ తుంటరి రాక్షసుని పని నేను చూచుకొందును. మీరు కొంత విశ్రాంతిని తీసికొనుడు అని నుడివెను. ఆంజనేయుని మాటలయం దర్థము గ్రహించి కొంతవడి విశ్రమించి ఆంజనేయుని సెలవుగైకొని, "మరుత్తనయా నా వచ్చిన పనియైనది లోకమునకు మంచి దినములు రానున్నవి" అని వీణ వాయించుచు నారదుడు తనదారినేగెను.

నారదుడు విశిష్టలక్షణములు గల మునీంద్రుడు. వైకుంఠ వాసము నందును స్వేచ్ఛా ప్రవేశము గలవాడు. తీరిక యైనపుడెల్ల త్రిలోకములు తిరుగుచునే ఉండును. ఎచ్చట తిరుగునో, ఎవరిని చూచునో ఏమి మాట్లాడునో అని యన్నియు తుదకు, సార్థకములు సర్వజన ప్రయోజన కరములే. ఆ రహస్యము లాతనికే యెఱుక.

పంపా తీరమునకు ఆంజనేయుడు వచ్చివారము దినములైన కాలేదు. దినచర్య యథావిధి సాగుచున్నది. ఒక నాడుదయమున సమీప ప్రాంతము నందొక క్రతువు నారంభించి ఋత్విక్కులు సామగాన స్వరమున హవిస్సులను గ్రహించుటకు దేవతల నాహ్వానించుచున్నారు. వారి వేద గానమును ఆసక్తితో వినుటకాంజనేయుడు దగ్గరగానున్న చెట్టుపై రహస్యముగ నుండెను. ఇంతలో ఒక పెద్ద భయంకరధ్వనితో "దేవతలెవ్వరు? దేవతలకు దేవతను నేనే, ఆ హోమద్రవ్యములన్నియు నేనపహరింతు"ననుచు చెట్ల చాటున నుండి ఒక భీకర రాక్షసు డరుదెంచెను. అతడే త్రిశూలరోముడు. చేతులు సాచి యజ్ఞ సంభారముల నారక్కసి గ్రహించు లోపల ఆంజనేయుడు తోకను బెంచి ఆ దైత్యుని చేయివెనుకకు లాగి తానారక్కసిపై కురికెను. ఇది ఏదో విపత్తువచ్చి పడినదని త్రిశూలరోముడు హనుమంతుని క్రిందకు త్రోసి అతని వాలమును పట్టి త్రిప్పనారంభించెను అచటనున్న మునులు దేవతలు భయపడి ప్రక్క ప్రక్కలకు పోయి అక్కటా ఈ రక్కసికి ఆంజనేయుడే చాలకున్నాడు అని ఆందోళన పడసాగిరి. ఆ రక్కసుని ప్రతిరోమము దీర్ఘనిశిత త్రిశూలమే. ఎంతకును పట్టుబడి లొంగడు. హనుమంతుడెట్లో ఆతని తలపైకురికి ఒక చేయితో కంఠమును బిగించి

వంరొక్క చేతి పిడికిలితో వాని గుండెపై పొడువ మొదలిడెను. త్రిశూలరోముడాంజనేయుని ముష్టిఘాతలకు తాళలేక తప్పించుకొని పారిపోయి ఒక చిన్న రాతి పెంకుగ మారి ఒక శిలాగర్భమున దాగెను. హనుమంతుడది కనిపెట్టి తన గాన విద్యచే నా శిలను కరగింపగా త్రిశూలరోముడు నెత్తురులు క్రక్కుచు నిజస్వరూపముతో అందుండి బయలు పడెను. వాని కిసుమంతయు తడవీయక ఆంజనేయుడా రక్కసుని పట్టి పిడికిలితో వాని వక్షము బ్రద్దలు చేసి చంపెను.

మునుల యాగము సక్రమముగా కొనసాగినది. నీవే యజ్ఞకర్తవు యజ్ఞ హోతవు యజ్ఞ భోక్తవు అని ఆ మునులు హనుమంతుని పూజించిరి. లోకమున కారక్కసుని బాధలు అంతమైనవి.

# నాగకన్య కథ

## పరాశర సంహిత - 32వ పటలము

కింపురుష ఖండమున సుషేణుడను గంధర్వుడు సదాచార సంపన్నుడు, వేదవేత్త, ప్రతిదినము నిష్ఠానియమములతో హనుమంతుని పూజించు భక్త శిఖామణి, ఉత్పలాక్షియను నొక నాగకన్య ఆకస్మికముగ వచ్చి ఆసుషేణుని కాళ్ళమీద బడి "ఓ జ్ఞాన భాస్కరా! నీవేనాకిపుడు శరణు. దయామయా! రక్తరోముడను క్రూరరాక్షసుడు నాగలోకమును జేరి అందరిని బాధించుచు నా సౌందర్యమును చూచి నామీద పడెను. వేరుదిక్కులేక నిన్ను జేరితిని ఆతని బారినుండి నన్ను రక్షింపుము స్వామీ!" అని విలపించ సాగెను. దయామయుడైన ఆ సుషేణుని గుండెలు కరిగినవి. 'ఓ కుమారీ విచారింపకుము. రాక్షసుల బాధల నుండి లోకుల తప్పించుటకు దైవము ఆంజనేయుడున్నాడు అని నుడివి హనుమన్మాల మంత్రము నుపదేశించెను. ఆమెయు భక్తి శ్రద్ధలతో పరమనిష్ఠాపరురాలై హనుమన్మంత్రము నిత్యము జపించుచు తన మొఱలామహనీయునికి వినిపించునా అనిసందియపడు చుండగా ఒకనాడు ఆమె కత్యాశ్చర్యమైనది. హనుమంతుడామె ముందు ప్రత్యక్షమై ఆమె బాధలను విని వెంటనే ఆమెతో నాగలోకమున రక్తరోముడున్న చోటికి ఏగగనే రక్తరోముడు హనుమంతుని చూచి మహాగ్రహాకారుడై "ఓహో నీవేనా ఆంజనేయుడనిన వానరుడవు. మాత్రిశూల రోముని చంపిన వాడవు" అని పెద్దపులి వలెనోరు తెరచి ఆంజనేయుని మ్రింగబోయెను. అదే అదనుగ ఆంజనేయుడు తనతోకతో వాని కాలు సేతులను కట్టివైచి రెండు చేతుల తోడను వాని వివృతవక్త్రమును పట్టి చీల్చి తలను రెండు ముక్కలుగ చేసి చంపెను. మహావీరుడై వచ్చిన రక్తరోముడు హనుమంతుని చేతి యందొక నిమేషమున పడిచచ్చెను.

నాగలోక నాయకమణియైన ఉత్పలాక్షి ఆంజనేయునికి దండప్రణామము లాచరించి హనుమంతుని మహిమను నాగలోకమున నాలుగు ప్రక్కలకు వ్యాపింపజేసెను.

# సుముఖుని కథ

## పరాశర సంహిత - 34వ పటలము

భారతోత్తర ఖండమున శ్రీ భద్రమను పేరనొక నగరము కలదు. అందు సుముఖుడను నొక బ్రాహ్మణోత్తముడు నివసించుచుండెను. అతడు హనుమత్ సప్తాక్షరి మంత్ర దీక్షా పరుడు. హనుమత్ప్రీతి కొరకు పూజా దినములందు ప్రత్యేకముగా పెక్కుమంది బ్రాహ్మణులను పిలిచి తీర్థ ప్రసాదములిచ్చి విందు భోజనము లేర్పాటు చేయువాడు. ఆ బ్రాహ్మణునికవసరమగు నేతిని ప్రతిదినము గోపాలుడొకడు తెచ్చి అమ్ముచుండువాడు.

ఒక దినమున ప్రత్యేకమైన హనుమత్పూజ నేర్పాటు జేసి పూజ్యులగు బ్రాహ్మణులను అతిథులుగా ఆహ్వానించి కార్య క్రమమును సుముఖుడారంభించెను. అతిథులందరు వచ్చిరి. పూజలు హోమములు చేయించు పురోహితులు వచ్చిరి. కాని గోపాలుడు నేయి తీసికొని రాలేదు. సుముఖుని కాందోళన యెక్కువయ్యెను. సుమూహూర్తము దాటుచున్నది. తన భక్తుని పూజలు భంగముగునట్లు తోచి ఆంజనేయుడే గోపాలుని వేషమున రెండు నేతి కుండలను నెత్తిపై పెట్టుకుని సమయమున కిచ్చినాడు. సుముఖుని వ్రతము యథావిధి పరి సమాప్తి అయినది. అందరికిని సంతృప్తి కలిగినది. అతిథులెల్లరు సుముఖుని ఔదార్యమునకు, దైవ భక్తికి మెచ్చి దీవించిరి. ఆనాడు వచ్చిన మాయ గోపాలుడును సుముఖుని పూజా ప్రసాదము స్వీకరించి తృప్తి పడి వెడలెను.

గోపాలుడు ప్రక్క పల్లెనుండి మధ్యలో ఒక చిన్న సెలయేరు దాటి రావలెను. సుముఖుని వ్రత దినమునాడు యథాపూర్వము నేతిని తీసికొని పెందలకడనే యేటి యొడ్డునకు వచ్చెను. రాత్రి కురిసిన కుంభవృష్టికి యేరు ఉప్పొంగి ప్రవహించుచున్నది. గోపాలుడు దాటలేక పోయెను. మఱునాడును అట్లే అయినది. బ్రాహ్మణోత్తముడు శపించునేమో నేయి అందలేదని భయపడుచు, గోపాలుడు హనుమత్పూజనే తలచుకొనుచు ఉండిపోయెను. మూడవ నాడు సెలయేరు వరద తగ్గినది. రెండు రోజుల నేతిని కూడ తీసికొని ఆనాడెట్లో ఒక తెప్పనెక్కి వెళ్ళి గోపాలుడు మున్ముందుగా సుముఖుని పాదముల మీద పడి "క్షమించుము స్వామీ! యేరు పొంగి ప్రవహించి రానిచ్చినది కాదు. ఒక తెప్పపై ఈనాడెట్లో వచ్చితిని అని ఎంతో ప్రార్థించెను.

సుముఖున కంతయు అత్యాశ్చర్యమైనది గోపాలుడు తాను రాలేదనుచున్నాడు, ఆ రెండు రోజులు నేయి తెచ్చియిచ్చిన గోపాలుడెవరు? అని తలంచుచు ఇది యంతయు భగవానుడగు ఆంజనేయుని లీలయే ఆతడే గోపాలుని వేషమున వచ్చి నేయి యిచ్చినాడను కొని పేవిధముల ఆంజనేయుని స్తుతించినాడు "స్వామీ నేతికుండలను మోయించిన పాపమును కట్టుకొంటిని క్షమింపుమని దీనుడై వేడెను. ఆ భక్తుని ప్రార్థనలాలకించి ఆంజనేయుడు ప్రత్యక్షమై "సుముఖా నీవలన నేరములేదు. నీవు నా భక్తుడవు. నీ వ్రతభంగమైనచో పెక్కుమంది బ్రాహ్మణోత్తములకు ఆశాభంగమగును. ఆశాభంగమొనర్చుట పాపము. నా భక్తుని ప్రతిజ్ఞ నెరవేఱుటకై నేనే గోపాలుని వేషమున వచ్చితినని అదృశ్యుడయ్యెను.

సుముఖుని ఆనందమునకు మేరలేదు ఆంజనేయుడే స్వయముగ సాయము చేయవచ్చినాడు ఇతోధికమైన దీక్షతో సప్తాక్షరి మంత్ర జపము చేయుచు సుముఖుడు తన పూజలు నిర్వర్తించుచు హనుమన్మహిమ నెల్లరకు బోధించుచు ధన్యుడై కాలముగడపెను.

# మైందుని కథ

## పరాశర సంహిత - 35వ పటలము

సుందరీ నగరమున మైందుడను విప్రోత్తముడు కలడు. వేద శాస్త్రములు చదివిన మహాజ్ఞాని, పవిత్ర వర్తనుడు. ప్రతిదిన హనుమత్పూజా పరాయణుడు. తపో ధనుడైన యావిప్రుడు కాశీయాత్రకు బయలు దేరి గంగను దాటుట కొక చిన్న నావనెక్కెను. కొంత దూరమేగు సరికి ఆ నావకు గల చిల్లు ద్వారా నీరు లోపలికి వచ్చి ఎంతపైకి తోడినను లాభము లేకపోయినది. నీరు నావలో నిండుచున్న కొలదియు ఒక్కొక్క అంగుళమే నావమునుగుచున్నది. ఈ విపత్తును గ్రహించి తనకిక మరణ మాసన్నమైనదని తలచి మైందుడు, ముఖమును కప్పుకుని హనుమన్మంత్రమును జపించుచు ధ్యాన వశుడయ్యెను.

భక్తుని ఆపద గ్రహించిన వెంటనే హనుమంతుడు పెద్ద వానర రూపమున ఆ నావనెత్తి నది ఒడ్డునకు జేర్చి తీరమందున్న వారు చూచుచుండగనే అదృశ్యుడయ్యెను. తన ధ్యానము నుండి మేల్కొనిన మైందువ కంతయు నాశ్చర్యమై తానెట్లు తీరమును చేరితినని యడుగగా "అయ్యా ఒక పెద్ద వానరుడు నావను మోసికొనివచ్చి దింపెను. అతడెవరు నీకీ సాయమెట్లు లభించినది" అని యెదురు ప్రశ్నించిరి.

ఆహా! ఇది యంతయు భగవానుడగు హనుమంతునిదయ. ఓ జనులారా! మీరు అదృష్టవంతులు హనుమద్దర్శనము మీకైనది, ఇన్ని నాళ్ళనుండి నేను హనుమత్సేవ చేయుచుండగా నాకా భాగ్యము కలుగలేదు అని మనస్సున అనుకొని మహా విచారమొంది గంగలో పడి ప్రాయోపవేశమునకు సిద్ధము కాగా హనుమంతుడు ప్రత్యక్షమై మైందు నోదార్చి కనుపడినను కనుపడకున్నను నేనెప్పుడును భక్త రక్షకుడనే అని ప్రసన్న ముఖుడై అంతర్ధానుడయ్యెను.

# ధర్మజుని రాజసూయము - పురుషమృగము

## పరాశర సంహిత - 51వ పటలము

ఇంద్ర ప్రస్థపురమున పాండు రాజ జ్యేష్ఠపుత్రుడైన ధర్మరాజు తన నలువురు తమ్ములతో కలసి రాజ్యమేర్పరచుకొని రాజసూయ యాగము చేయు సంకల్పమున నుండెను. మున్ముందు తన తమ్ములను నాలుగు దిక్కులకు బంపి సకల రాజన్యవరులను తన వశము చేసికొని రాజసూయ యాగమును ప్రారంభించెను. దేశమందంతటి నుండియు రాజన్యులు బంధు మిత్రులు యాగమునకు వచ్చెదరు. భోజనశాల పవిత్రముగ శుద్ధిగ నుండవలెను. దేవలోకమునుండి పురుష మృగమును దెచ్చి ఆ శాల యందు వసింపజేసినచో అది పావన మగునని మునులు చెప్పగా ధర్మరాజు వాయుకుమారుడైన భీముని ఆ పనికి నియోగించెను.

భీముడు దేవలోకమునకేగు మార్గములో హిమగిరి అరణ్యముల త్రోవలో అడ్డుగా హనుమంతుడు పరుండెను. ఈ భీకర వానరుడెవ్వడో నాత్రోవ కడ్డు వచ్చెనని భీముడు తన బలముజూపి వానిని తొలగింపజూచెను గాని సాధ్యము కాలేదు. ఆ వానరుని పలు విధముల భీముడు స్తుతించి నమస్కారములర్పించి, తన రాక కారణమెఱిగింపగా హనుమంతుడును భీముని బలసాహసములను, మెచ్చుకొని భీమా! నీవు జాగ్రత్తగ నుండవలెను. నీవును వాయు కుమారుడవు, నా సోదరుడవు గాన చెప్పుచున్నాను. నీవు తేగోరు పురుషమృగము శివభక్తి కల మృగము. తన కెదురువచ్చిన పురుషులను చంపితినును. నీ ప్రార్థన విని ఒక వేళ పురుషమృగము వచ్చినను దాని జవసత్వములకు నీవాగలేవు. అదినీవెంట వచ్చు ఉపాయము చూడుము. నా వాలమునుండి గుప్పెడు రోమములు తీసి యిచ్చుచున్నాను. వీనిని ఒక్కటొక్కటే దూరదూరముగ నీదారియందు పడవేయుచు రమ్ము. ఒక్కొక్క రోమము పడినచోట ఒక్కొక శివలింగము ఉద్భవించును ఆ లింగమునకు పూజచేసిన తర్వాతనే మరల పురుషమృగము నీ వెనుకవచ్చును. ఆ విధముగ ఆ మృగమును తీసికొనివచ్చి మీ భోజన శాలయందుంచు''ము అని చెప్పెను. హనుమంతుడెంతటి బలవంతుడో ఎట్టి శక్తి సామర్థ్యములు కలవాడో భీముడిదివరకే వినియుండెను. ఆ వీర సాహసరూపములను భీముడు చూడగోరెను. భీముని కోరికపై హనుమంతుడు

తాను లంక ప్రవేశించిన నాటి సూక్ష్మ రూపమును సముద్రముపై లంఘించునప్పటి ఆకారము, రాక్షసులను చంపునాటి భీకరోన్నత రూపమును చూపెను. ఆ మహా రూపములను చూడలేక భీముడు మూర్ఛిల్లగా హనుమంతుడాతనిని సేదదేర్చి దీవించి పంపెను.

భీముడు దేవలోకమునకు చేరునప్పటికి పురుషమృగము ఇంద్రుని సభ సుధర్మయందున్నది. తాను వచ్చిన కారణమునివేదించి ధర్మజుని పవిత్ర యాగము విజయ ప్రదమెునర్చుమని ఆ పురుష మృగమును భీముడర్థింపగా అదియొప్పుకొని తన కష్టగనున్న వారిని చయ్యన తాను భక్షింపగలనను నియమము విధించినది. భీముడందులకంగీకరించెను. వారిరువురు ఇంద్ర ప్రస్థమునకు బయలుదేరినారు. వారేగు మార్గమున ఆంజనేయుని రోమములొక్కటొక్కటే వదలుచు భీముడు ముందు నడుచుచున్నాడు. అచ్చట నొకొక్క శివలింగముద్భవించు చుండగా ఆ మృగ మాలింగములను పూజించుచు వచ్చెను. ఈ లోపున భీముడు ముందునకు పోవుచుండువాడు. తుదకు ఇంద్ర ప్రస్థము చేరినారు. యాగ భోజనశాల సమీపించగనే భీముడొక కాలు శాలలో బెట్టి రెండవ కాలెత్తబోవు చుండగా ఆ పురుష మృగమాతనిని తినుటకు పట్టిలాగెను. భీముడు వెనుదిరిగి మృగముతో ''ఓ సర్వజ్ఞుడా ధర్మమెఱిగినవాడా! నీ ప్రతినను మఱచి నువ్విట్లు మా యింటిలో నన్ను పట్టుకొని తినబోవు చున్నావు. ఇది అన్యాయము'' అని ప్రార్థింపగా పురుషమృగ మంగీకరింపక ధర్మమెఱిగిన వాడుగాన ధర్మజుని కడకేగి తగవు తీర్చమని అడిగెను. ధర్మరాజు వివరములన్నియు తెలిసికొని, సగము మనిషి ఈవల నున్నవాడు గాన భీముని సగభాగము నీవు తినుట ధర్మమే అని తీర్పుచెప్పెను. భీముడు కాదనలేదు. తన శరీరార్ధభాగమును ఆ మృగము నోటికందించెను. భీముని చర్య మృగమున కాశ్చర్యము గొలిపెను. ధర్మజుని న్యాయమునకు న్యాయమునెడల ఆతని ఆసక్తికి భీముని ధైర్యసాహసములకు ఆ పురుషమృగము సంతసించి భీముని వదలెను.

ధర్మజుని రాజసూయము విజయప్రదముగా ముగిసినది. హనుమంతుని ప్రత్యక్షమెునర్చుకొని కార్యము సానుకూలము చేసినందులకు ధర్మరాజు భీమునభినందించి, హనుమంతుని స్తోత్రములుగావించి పురుషమృగమును పూజించి దానిని మరల దేవలోకస్థానమున కనిపెను.

# భీమాంజనేయుల కలయిక - అర్జునుని కపిధ్వజము

## (మహా భారతము - ఆరణ్యపర్వము చతుర్థాశ్వాసము)

పాండవ జ్యేష్ఠుడగు ధర్మరాజు తన దాయాదియగు దుర్యోధనునిచే మాయా ద్యూతంబున నోడి తానాడిన పందెము ప్రకారము భార్య ద్రౌపది తోడను, అనుజులు భీమార్జుననకుల సహదేవులతోడను కలసి వనవాసమున కేగి కొన్ని దినములకా యరణ్యమధ్య మందుగల గంధ మాదన పర్వత ప్రాంతము జేరిరి. ఒకనాడు ద్రౌపదీ భీములు ఒకచో నున్నతరి వేయి చక్కని దళములు, మధురమ్మైన సౌరభముగల తామరపూవొకటి తీవ్రముగ వీచుగాలికి ఎగిరి వచ్చి వారి ముందు పడెను. ఆ పద్మ సౌందర్యమున కాశ్చర్యపడి ద్రౌపది తన కట్టి పూవులదెచ్చి పెట్టుమని భీముని అడుగగా, వెంటనే యతడును ధనుర్బాణ సహితుడై బయలు వెడలి ఆ పుష్ప సౌరభము వచ్చు చున్న దిశకేగెను.

అడుగిడుటకు వీలుకాని కీకారణ్యము. గగనము నంటు వృక్షములు. సింహశార్దూలాది జంతువుల భీకరారవములు. ఈ ఆటంకములకు సరకు గొనక దారికడ్డుతగులు తరువులను నేలబడగూల్చుచు, మీదమీద కరుదెంచు క్రూరమృగముల దండించి పారద్రోలుచు భీముడు ముందునకేగెను. మార్గమధ్యమున చల్లని గాలి వీచుచున్నదెస నొక సుందరకాసారము జూచి యా కొలను నందు గ్రుంకులిడి లేచి యొక మహారవమొనర్చెను. ఆ పరిసరములందే కదళీవనమున ఏకాంత యోగ నిద్రయందున్న ఆంజనేయుడా కంఠధ్వని విని యబ్బురమంది తన తమ్ముడగు భీముని కంఠ స్వరమును బోలియున్నదని కొంత సంతృప్తితో ఆ ధ్వని వచ్చు మార్గమున కడ్డుగ పెద్ద పెద్ద చెట్లు పడగొట్టి, విలాసముగ తోక నాడించుచు యాదారి కడ్డుగ పరుండెను.

భీముడా వానరమును చూచెను. సామాన్యమగు కపికాదు. ఆజానుబాహువు. మహాబలిష్ఠము ఉన్నతవక్షము. కనులు విద్యుద్గోళముల వలె వెలుగుచున్నవి. మొగము మహా తేజో వంతముగ నున్నది. ఆ విగ్రహమును చూచి భీముడు కొంత అదిరిపడి "ఎవరవు నీవునాదారి నుండి తొలగుము నేనావలకు పోవలెను." అని గద్దించి పలికెను. హనుమంతుడంత "నీవెవరవు మానవుడవా. నేనేదో అడవిలో కాయకసరుతిని బ్రతుకుచు ముసలి వాడనయి

ఇచ్చట నుంటిని, దుస్సహమైన ధ్వని చేసి నన్నేల లేపితివి? మానవులు వివేకవంతులుగదా నాకు సాయము చేయుట మాని నన్ను బెదిరింతువా, నేను కదలలేను" ఆవశ్యకమైనచో నావాలమును ప్రక్కకు నెట్టి నీదారినేగుము" అనగనే భీముడా గ్రహవశుడై "బాగు బాగు నాకే నీతులు చెప్పుచున్నావా, తోకపట్టుకొని బయట కీడ్చెదనని తోకను కాలితో కదపబోయెను తోక అణుమాత్రమును కదలలేదు. రెండు చేతులతో పైకెత్తబోయి తన బలమంతయు చూపెను. ఒడలు చెమట పట్టి కాలు సేతు లలసిపోయినవి. లాభములేక పోయినది. భీమునకు కోపమెక్కువైనది. ఓ కోతీ నీగర్వము సాగదు పూర్వము హనుమంతుడు మహా సముద్రము దాటినట్లే నిన్నును ఈ పర్వతమును దాటి ఒక్కగంతులో పైకి పోయెదను. నేను హనుమంతునంతటి బలవంతుడను. వాయు పుత్రుడను, భీముడు నాపేరు అని సింహనాదము చేసెను. హనుమంతు డా మాటలు విని "ఓహో నీవు కృతయుగము నాటి హనుమంతునెరుగుదువా! ఆ కథ నాకు చెప్పు"మనగా భీముడంతట ఆసక్తితో హనుమంతుని కథ నంతయు చెప్పి హనుమంతుని తలచి నమస్కరించెను. అంతట హనుమంతుడు ఆదరదరహాసమున, "భీమా! నీవు నాకు సోదరుడవు నేనే హనుమంతుడను" అనగా భీముడాతని కాళ్ళపై బడి తానేగు చున్న వృత్తాంతము తెల్పి" ఆశీర్వదింపవేడెను. సౌగంధిక పద్మ కాసారమును యక్ష రాక్షసులు, ఆ తరువాత దేవతలు కాపాడుచుందురు. నీవు కడు వివేకముతో వలసిన చోట బలము చూపి నీకార్యమును నెరవేర్చుము. దేవతలు హోమ ప్రియులు దైవభక్తి వశులుగాన బలసాహసములకు తొందర పనికిరాదు. నీకా సమర్థతయున్నది అను చున్న హనుమంతునికి భీముడు మరల మ్రొక్కి "నీవు నా సోదరుడవగుట నా భాగ్యము నీవు దైవసమానుడవు సముద్రము లంఘించునప్పటి నీ యాకారము చూడగోరెదను, అనుగ్రహింపుమన" హనుమంతుడు నవ్వి, అదికృత యుగమయ్యా అప్పుడు అన్ని వర్ణములు వారు వేదోక్త సదాచారులు ఇది ద్వాపరయుగాంతము. కలియుగము దగ్గఱపడుచున్నది. ధరణిపై కృ తయుగమున నాలుగు పాదములనడచిన ధర్మము క్రమ క్రమముగ నశించుచున్నది. కలియుగము నాటికి ఒక పాదమే ఉండును కలియుగమున నానావిధ దురాచారములు, రోగములును ప్రబలును. దైవ చింతనము

సదాచారమొక్కటియే భవ తారకము అప్పటి నా ఆకారము ఇప్పుడు నీవు దర్శింపలేవు. అయినను చూడుము అని ఆంజనేయుడు దిజ్ఞభోవ్యాప్త తేజముతో భీకర రూప విజృంభణమున లేచెను. భీముడా రూపమును చూడలేక మన్నింపుము సోదరా నీ మహా రూపము నుపసంహరింపుము నాకు భయమగుచున్నది. నేనన్న మాటలకు నన్ను క్షమింపుమని ప్రార్థింపగా హనుమంతుడు తన నిజరూపమును దాల్చెను.

భీముడు హనుమంతునకు మరల మ్రొక్కులాచరించి నిలచెను.

ఆంజనేయు డాదరమున భీముని దగ్గఱకు తీసికొని సోదరా నీవు మహా బలవంతుడవు. మీ దాయాదులగు దుర్యోధనాదులతో మీకు యుద్ధము కానున్నది. అందు మీకు విజయము నిశ్చయము. నీకిష్టమెద్దియో కోరుకొనుము. దానిని జేసెదననగా భీముడా హనుమంతుని యాశీస్సుల వేడుకొనెను. హనుమంతుడు మరల సోదరా నీవు చేయు ప్రయత్నములందును యుద్ధ సమయము నందును నన్ను దలంపుము. మీకు శ్రేయమగును. నా చరిత్రము ధరణినున్నంతవరకు మీకు విజయమే. నీ యనుజుడు అర్జునుడు అతిరథుడు, ఆతని రథ కేతనమునందున నేనుండి మీ యుద్ధకార్యములను తిలకించు చుందును. నేనున్న ఆ కేతనము విజయధ్వజమై విలసిల్లును. ఇక నీవరుగ దలచిన సౌగంధిక సరోవరమునకు మార్గమిదియే ఈ దారి నరుగుమని చూపి తన దీవనలిచ్చి పంపెను.

భీముడు హనుమంతుని యాశీస్సులను గొని యినుమడించిన యుత్సాహముననేగి సరోవర రక్షకులుగా యక్ష రాక్షసుల నిర్జించి కుబేరుని సౌగంధిక సరోవరము జొచ్చి అందలి కనక కమలములను గ్రహించి వెనుదిరుగునంతలో కుబేరుడు వచ్చి భీముని సాహసమునకు మెచ్చి, ధర్మమూర్తి యగు ధర్మజు సోదరుడీతడని యెఱిగి అతని నాదరించి పంపెను.

పాండవ కౌరవ యుద్ధమున అర్జునుని రథముపై హనుమంతుని చిత్రము గల కేతనము మహాకాంతి మంతమై కౌరవులకు భయము గొల్పుచు విరాజిల్లినది. హనుమంతుని మహిమను దలచుకొని ధర్మజాదులు ఆ మహా వీరుని వేనోళ్ళ నుతించిరి.

# అర్జునుడు - కపిధ్వజము

## పరాశర సంహిత - 16వ పటలము

అర్జునుడు కపిధ్వజుడను ప్రశస్తికి మఱియొక చిత్రమైన కథ గలదు. పూర్వము అష్టాక్షరీ హనుమన్మంత్రో పాసకుడు విజయుడను నరపాలుడొకడు గలడు. హనుమంతుని అనుగ్రహము పొందిన ధన్యుడు. మఱుసటి జన్మమున అతడే పాండవ మధ్యముడైన అర్జునుడుగా పుట్టెనను ప్రతీతియు కలదు. అర్జునుడు మహావీరుడు, మహాధన్వి, అతడు తన దేశ సంచార మధ్యమున దక్షిణమున సేతువు వరకును పోయి అచ్చట శ్రీరాముడు నిర్మించిన వారధిని గూర్చి విని, సేతు బంధము రాళ్ళతో కావలెనా, నేను బాణములతో కట్టి యుందునను. అని నుడువునంతలో శ్రీరాముని గూర్చిన మాటవిని హనుమంతుడచ్చటికి వచ్చి అర్జునునితో నీవు బాణములతో వారధి కట్టుదువా ఏదీ నీవు కట్టుము నేనొక కాలితో తొక్కి చూచెదను. నేనట్లు నీవారధివి విరగగొట్టలేనిచో నీ కేతనమున విజయ చిహ్నమగుదుననియు మాటయిచ్చెను.

అర్జునుడా మాటలువిని తన బాణ విద్యాతిశయము జూపి వారధి నిర్మించెను. హనుమంతుడు బలము నుపయోగించి కాలితో త్రొక్కగా ఆ బాణవారధి విరిగి ముక్కలైనది. ఆ వానరుని బలము చూచి అర్జునుడు అట్లే మరల వారధి నిర్మించెను. అర్జునినిపై దయతో శ్రీకృష్ణుడు కూర్మమై ఆ బాణ వారధి క్రింద జేరి వారధిని కాపాడుచుండెను. హనుమంతుడా వారధిని తన రెండు కాళ్ళతో శక్తికొలది పెక్కువార్లు త్రొక్కినను ఆ వారధి అట్లే ఉన్నది. హనుమంతుడాశ్చర్యపడి చూచుచుండ, అదియంతయు తన ధనుర్బాణ పాటవమే అనుకొని అర్జునుడు గర్వపడుచుండగా, శ్రీకృష్ణుడచ్చేరు వంది అర్జునా! అది యంతయు నీ శక్తిగాదు. నీవు కట్టిన వారధి క్రిందనేను కూర్మమై కాచితిని. ఆ వానరుడెవ్వరో కాదు. సాక్షాత్తు హనుమంతుడు. శివాంశ సంభూతుడైన మహాబలుడు. ఆత డా శర జాలమును కాళ్ళతో త్రొక్కగా నా వీపెట్లు బ్రద్దలైనదో చూడుము. రక్తములు మడుగులు గట్టినవి. అనిన మాటలకు అర్జునుడు నిశ్చేష్టుడై హనుమంతునకును శ్రీకృష్ణునకును మ్రొక్కులిడి తన తప్పు తెలిసికొనెను.

హనుమంతుడును విజయుని ధనుర్విద్యా శక్తికి అభినందించి, తాననిన ప్రకారము అర్జునుని కేతనమున విజయ చిహ్నముగా నుండి అర్జునుని దీవించి పంపెను. అర్జునునకు కపికేతనుడను పేరును వచ్చినది.

# శ్రీ హనుమాన్ చాలీసా

## భక్త తులసీ దాసు

### హిందీ మూలము

1. శ్రీ గురు చరణ సరోజ రజ
నిజమన ముకుర సుధారి
నౌరజ రఘువర బిమల జల
దాయక ఫల చారి॥

2. బుద్ధి హీన తను జానికై
సుమిరౌ పవన కుమార్
బలబుద్ధి విద్యాదేహు మొహి
హురహు కలేశ వికార్॥

3. అంజనీ గర్భ సంభూతో
వాయుపుత్రో మహా బల
కుమారో బ్రహ్మచారీచ
హను మతే నమోనమః॥

4. పవన తనయ సంకట హరన
మంగల మూరతి రూప
రామలఖన సీతాసహిత
హృదయ బసహు సురభూప॥

5. జయ హనుమాన జ్ఞానగుణ సాగర
జయకపీశ తిహులోక ఉజాగర॥

6. రామదూత అతులిత బలధామ
అంజని పుత్ర పవనసుతనామ॥

7. మహావీర విక్రమ బజరంగీ
కుమతినివార సుమతికే సంగీ

### తెలుగు అనువాదము

1. గురుప దాంబుజ ధూళి కూర్మితో గొనుచు
మనమను అద్దంపు మలినమున్ దుడిచి
ఇలపైన పురుషార్థముల నిచ్చు విధము
వినుతింతు శ్రీరామ పృధ్వీశు యశము

2. అవివేకినై జన్మ మందితి గాన
మనమున స్మరియింతు మారుతసూను
అతడె నాక్లేశముల్ హరియించు గాక
సద్బుద్ధి బలవిద్య సమకూర్చినాకు.

3. అనిల కుమార! శ్రీ అంజనీ పుత్ర!
బలవంత హనుమంత! భవ్య చారిత్ర!
బ్రహ్మచారీ! సర్వ బాధాపహర్త!
ప్రణతి పూజలు నీకు భక్తినొనర్తు.

4. జానకీ రామ లక్ష్మణులను గూడి
సకల దేవతలతో, సత్కృపతోడ
మంగళరూప! ఓ మారుతపుత్ర!
వసియింపు నామది భవ్యచారిత్ర!

5. జయము శ్రీ హనుమంత! జయము జ్ఞానాబ్ధి!
త్రిభువనోజ్జ్వల రూప! శ్రీ కపి నాథ!

6. శ్రీరామ వరదూత! మారుతి నామ!
అంజనా సతి పుత్ర! అతి బల ధామ!

7. బహు వీర విక్రమ! వజ్రశరీర!
సుజన సంగ విహార! కుజన సంహార!

8. కాంచన వరణ విరాజసువేశా
కానన కుండల కుంచిత కేశా॥
9. హాథవజ్ర ఔధ్వజావిరాజై
కాంధేమూంజ జనేవూ ఛాజై॥
10. శంకర సువన కేసరీ నందన
తేజప్రతాప మహాజగ వందన॥
11. విద్యావాన గుణీ అతి చాతుర
రామ కాజ కరి వేకో ఆతుర॥
12. ప్రభుచరిత్ర సునివే కోరసియా
రామలఖన సీతామన బసియా॥
13. సూక్ష్మరూపధరి సియహిదిఖావా
వికట రూపధరి లంక జరావా॥
14. భీమ రూపధరి అసుర సంహారే
రామ చంద్రకే కాజసవారే
15. లాయసజీవన లఖన జియాయే
శ్రీరఘువీర హరషి ఉరలాయే॥
16. రఘుపతి కీన్హీ బహుత బడాయీ
తుమ్మ మప్రియ భరత హిసమ భాయీ॥
17. సహసవదన తుమ్హారో యశగావై
అసకహిశ్రీపతి కంఠ లగావై॥
18. సనకాదిక బ్రహ్మాది మునీశా
నారద శారద సహిత అహీశా॥
19. యమకుబేర దిగపాల జహాతే
కవి కోవిద కహిసకై కహాతే॥
20. తుమ ఉపకార సుగ్రీవహి కీన్హా
రామ మిలాయ రాజపద దీన్హా॥

8. కుంచితాలక! కర్ణకుండల భూష!
కాంచన తనువర్ణ కమనీయ వేష!
9. విజయ ధ్వజాంచిత పృథువజ్ర హస్తః
కటి ధృతకుశ ముంజః కనకోపవీతః
10. రుద్రాంశసంభూత! రుచిర ప్రతాప!
కేసరిసుతః త్రిలోకీవంద్య రూప!
11. చతుర బుద్ధివిశాలః సద్గుణాపాల!
విద్యా నిలయః రామవిభుకార్యలోల!
12. జానకీ రామలక్ష్మణ సక్తచిత్తః
రామ భూపతి కథాశ్రవణాను రక్తః
13. క్షోణిజన్ గంటివి సూక్ష్మరూపమున
కాల్చినాడవు లంక కడుమహాకృతిని
14. పరిమార్చి అసురులన్ భయదరూపమున
నెఱవేర్చితివి రామ నృపుని కార్యమును.
15. సంజీవిఁగొనితెచ్చి సౌమిత్రి కిచ్చి
బ్రతికింప ముదమంది రాముడు మెచ్చి
16. భరతు బోలిన ప్రియభ్రాతవటంచు
నుడువుదునని జూచి కడు సన్నుతించె.
17. వేనోళ్ళ నీకీర్తి వినుతించు చుండి
కౌగిలించెను నీదు గళము రాముడు
18. ఆదిశేషుండును అబ్జాసనుండు!
సనకాదులును వాణిముని నారదుండు
19. పండితుల్ కవులు దిక్పతులైన గూడ
అలవిగాదిక నీదు ఖ్యాతి గొండాడ
20. రామ సఖ్యము గూర్చి రాజ్యమ్ము నీవు
ఎలమి సుగ్రీవున కిప్పించి నావు

21. తుమ్హారో మంత్ర విభీషణ మానా
లంకేశ్వర భయేసబ జగ జానా॥

22. యుగసహస్రయేజన పర భానూ
లీల్యోతాహి మధుంఫల జానూ॥

23. ప్రభు ముద్రికా మేలిముఖ మహి
జలధి లాంఘిగయే అచరచనాహి!

24. దుర్గమ కాజ జగతకే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే

25. రాముడు ఆరే తుమ రఖవారే
హోతన ఆజ్ఞా బినుపై సారే॥

26. తమరక్షక కాహుకోడరనా
ఆపనతేజ సమ్హారో ఆపై

27. సబసుఖల హైతుమ్హారీ శరనా
తీనో లోక హంకతే కాంపై॥

28. భూత పిశాచనికట నహి ఆవై
మహావీర జబ నామ సునావై॥

29. నాసైరోగ హరై సఖపీరా
జపత నిరంతర హనుమత వీరా

30. సంకటసే హనుమాన ఛుడావై
మనక్రమ వచన ధ్యానజోలావై॥

31. సబపర రామ తపస్వీ రాజా
తినకే కాజ సకల తుమ సాజా

32. ఔరమనోరధ జోకోయీలావై
తాసు ఆమిత జీవన ఫల పావై

33. చారోయుగ పరతాప తుమ్హారా
హైపరసిద్ధ జగత ఉజియారా॥

21. నిఖిలజగమెఱుంగు నీమాట వినుచు
అలవిభీషణుఁడయ్యె అసురేశుడనుచు

22. మధుర ఫలమ్మని మార్తాండుఁ బట్ట
యోజన సాహస్ర యుగమేగు దిట్టః

23. రామముద్రిక నోట గ్రహియించి లీల
అబ్ధి దాటితివన్న ఆశ్చర్యమేల?

24. ఎట్టి దుష్కరకార్యమేని యీ జగతి
సుకరమ్మై వరలు నీ శుభదయా నిరతి,

25. రాముని ద్వారమ్ము రక్షించు నీదు
ఆజ్ఞ లేకయె లోనికరుగంగ రాదు,

26. సౌఖ్యమ్ము లబ్బు నీశరణు గల్గినను
భయపడ పనిలేదు వసుధ దేనికిని,

27. నీవె తాళగలవు నీ తేజమునకు
కంపించు జగము నీ గర్జనమ్మునకు,

28. వీరాధి వీర నీపేరు విన్నంత
భూతపిశాచముల్ పోవా పొంత

29. వీర హన్మంతుని పేరు జపించ
రోగముల్ పీడలు వేగనశించు.

30. తను మనోవాక్కుల ధ్యానించువారి
బాధలు సర్వమ్ము బాపు సామీరి

31. రాజశేఖరుడగు రాముని పనులు
సాధించెదవు నీవె సకలమో హనుమః

32. ఎవరెద్ది కోరిన ఈడేర్చి యెలమి
చేకూర్చు హనుమయె జీవన ఫలము

33. అలరు ప్రసిద్ధమై నలుయుగమ్ములను
నిఖిలోజ్జ్వలమ్మయి నీశౌర్యమిలను

బాణాగ్నికిన్ నిప్పు ్రహుండీ లక్ష్మణన్ వేగ శీతాద్రికిన్ బోయి సంజీవి నిందెచ్చి జీవింపగా జేసి శ్రీరాము దుఃఖంబు బోకార్చి నా వోమహాసాహసోపేత! యుద్ధమ్మునన్ రావణుంద్రుంచి, భూమీజనుంగూడి సాకేతముంజేరు శ్రీరాముతోనేగి, శ్రీరామ పట్టాభిషేకమ్ము హర్షమ్ముతో గాంచి శ్రీరామమంత్రాక్షరోద్దీప్త షట్చక్ర రూపమ్ము నిత్యమ్ము హృత్పద్మమందుంచి ధ్యానమ్ము గావించు భక్తాంజనేయుండవై యోగివై యొప్పి - సీతామహాదేవియున్ బోధసేయంగ ఆద్యుం డమేయుండనంతుండు నౌచున్ పరబ్రహ్మమై యొప్పు శ్రీరామతత్త్వమ్ము సర్వమ్ము శ్రద్ధాళువై నేర్చి మౌనీంద్రులున్ పొందగాలేని జ్ఞాన ప్రకాశుండవై యోగసిద్ధుండవై బ్రహ్మభావుండవై త్రైలోక్యసంస్తుత్య మహోత్స్యవిభ్రాజ మానుండవై, శాకినీ ఢాకినీ దుష్టభూతాదులన్ దూరమున్ జేయు వీరాంజనేయుండవై, సర్వకార్యమ్ములందున్ జయమ్మున్ బ్రసాదించు దేవుండవై, విశ్వమందున్ చిరంజీవివై భావికాలంబునన్ బ్రహ్మవై నేడు శ్రీగంధమాదాద్రి యందున్ తపోనిష్ఠ లో కాలముంబుచ్చుచున్, రామనామాంకిత ధ్యాన చిత్తుండవై వేదశాస్త్ర ప్రబోధమ్ము లాలించుచున్, భక్తులంబ్రోచుచున్ దుష్టులంద్రుంచుచున్, లోక సంక్షేమమున్ గూర్చుచున్ సర్వ వంద్యుండవౌ దివ్య తేజోనిధీ! నీదు కారుణ్యవీక్షామృతా సారముల్ మాపయిన్ జిల్కుచున్ ప్రసన్నుండవై సుందరాస్యుండవై మందహాసుండవై నీదు పాదాంబుజ ధ్యాన నిష్ఠాత్ములౌ మమ్ము దీవించి పాలింపుమో కీర్తిమంతా, హనూమంత, శ్రీ అంజనాపుత్ర సంస్తుత్యచారిత్ర, సౌవర్ణ సౌందర్య గాత్రా, నమస్తే నమస్తే నమస్తే నమః.

# ఫలశ్రుతి

శ్రీరమ్య గుణగేయ శ్రీ ఆంజనేయ,
వారాశి లంఘన ప్రాభవోపాయ!

శివశక్తి సంభూత శ్రీరామ దూత,
స్తవనీయ జవసత్వ సాహసోపేత!

అనుపమ బలధామ హనుమంత నామ,
జననుత సౌజన్య సద్గుణ స్తోమ!

విమల వేద జ్ఞాన వీధీవిహార,
విమత మర్ధన ధీర వీరాధి వీర!

వానర బలనేత భక్త సంత్రాత,
జానకీ రాముల సౌఖ్య సంధాత!

జనులకు ఇహపర సౌఖ్యప్రదమ్ము,
అనుపమ బలము నీ అభయ హస్తమ్ము!

గంధ మాదనగిరి గహన తపస్వి,
బంధుర పరతత్వ భవ్య మనస్వి!

మహిత శక్త్యన్వీత మంత్ర స్వరూప,
అహిత దర్పనిహంత అతులప్రతాప!

భువిని కొండేపూడి పుణ్య వంశజుడ,
ప్రవిమల సాహితీ వ్రత నీతి పరుడ!

సుబ్బరాయాఖ్యుడ సుకవి శేఖరుడ,
ప్రబ్బిన దీక్ష నీ భక్తి తత్పరుడ!

నీ రమ్య చరితమ్ము నియతివ్రాసితిని
ధారుణి నాజన్మ తనర ధన్యతను - !

చదివిన వినిన నీ సచ్చరిత్రము
సదమల సంక్షేమ సంపద్ప్రదమ్ము

జయము సద్గుణ వంత జయము ధీమంత,
జయము దానవ హంత జయము హన్మంత!

ఇలను మాయందు నీ కృపయున్న చాలు
వెలయించు నది మాకు విజయమున్ శ్రీలు!

# ప్రసన్న భారతి

## సాహిత్య విద్యా సాంస్కృతిక సేవా సంస్థ

మహోజ్జ్వల మగు మన ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రయోజనమును ప్రాధాన్యమును, సంప్రదాయ కవితా వైశిష్ట్యమును ప్రకాశింపజేయు పవిత్ర సంస్థ.

## ఈ సంస్థ కార్యక్రమములు

1. ఉత్తమ సాహిత్య త్రైమాసిక పత్రిక ''ప్రసన్న భారతి'' ని కొని చదవండి, పదిమంది చే చదివించండి.

   ఇది మన పత్రిక - మన భాషా పత్రిక

   సం॥ర చందా రు. 60-00లు శాశ్వత చందా

   రు. 1116-00 లు

2. ఉత్తమ సాహిత్య రచనల ప్రచురణ

   పూర్తివివరములు, అట్ట వెనుక భాగమునున్నవి

   మెత్తముగా కొను వారికి మంచి డిస్కౌంటు కలదు

3. సాహితీ సదస్సులు - కవి సమ్మేళములు, పేద పిల్లలకు సహాయము

చిరునామా :

47-10-5, ద్వారకానగరము, విశాఖపట్నం - 16

ఆంధ్రప్రదేస్ - ఇండియా